# ఆత్మీయ రాగాలు

(కవితా సంకలనం)

జె. బాపురెడ్డి

జూబిలీ పబ్లికేషన్స్

హైదరాబాదు

# Aātmeeya Rāgālu

(Anthology of Poetry)

**by**

**Dr. J. Bapu Reddy**

---



First Edition : 3rd August, 1999

Price : Rs. 100/-
US $ : 10

**JUBILEE PUBLICATIONS**
Plot No. 10, Road 5,
Jubilee Hills
Hyderabad - 500 033
Ph: 3608381

Copies available at :
**"VISHALANDRA PUBLISHERS"**
4-1-435, Bank Street, Vignan Bhavan,
Hyderabad and Branches.

**NAVODAYA BOOK HOUSE**
Opp. Arya Samaj Mandir
Kachiguda, Hyderabad - 500 027.

**BOOK LINKS CORPORATION**
Narayanguda, Hyderabad - 500 029.

Designed & Printed at :
**VIPLA COMPUTER SERVICES**
Nallakunta, Hyderabad - 500 044.
Ph. : 7673309

Composed by:
**SRI DATTA SAI GRAPHICS**
1-8-702/105, Nallakunta,
Hyderabad - 500 044.
Ph. : 7633275, 3020719

# అంకితం



సాహిత్య సంస్కృతుల వికాసానికి

మానవీయ మూల్యాల పరిరక్షణకు

దోహదం చేస్తున్న పారిశ్రామికవేత్త

వదాన్య శేఖరుడు

శ్రీ సారిపల్లి కొండలరావుగారికి

ఈ కృతి

స్నేహూపాయనంగా

అంకితం

# ప్రేమాంకితునికి అంకితం

నీవు పుట్టిన రోజు
పార్వతీపురం పరిమళించింది
జంఝావతి పరవశించింది
నాగావళి నాట్యమాడింది
వేగవతి జోలపాడింది

శ్రీకాకుళం - విజయనగరం
శివకేశవ శక్తులై
చేతులెత్తి దీవించాయి
తెలుగుతల్లి
నీ ప్రతిభావల్లిని గుర్తించి
భాగ్యనగరానికి ఆహ్వానించింది

మట్టిని నమ్ముకున్న
"కర్షక దొరల" వంశంలో పుట్టి
యంత్రాలను నమ్ముకున్న వృత్తిని చేపట్టిన
"కార్మిక దొరవు" నీవు
ఏదేమైనా,
మానవీయ విలువలకే గొడుగుపట్టిన
"ధార్మిక దొరవు" నీవు
"ఓం శాంతి" మంత్రశక్తిని ఉపాసించే
"మార్మిక దొరవు" నీవు

సాహిత్య సంస్కృతీ సీమల్లో
సౌహిత్య సౌరభాలు కురిపించే

సరిక్రొత్త వసంతానివి
"సారిపల్లి" ని సార్థక నామంచేసిన,
సద్గుణసారాల కొండలరావు నీవు!

కలం పట్టిన అక్షరాలు
గళమెత్తిన రాగాలు
గజ్జె కట్టిన నాట్యాలు
తెర ఎత్తిన నాటకాలు
రూపందిద్దుకొనే రంగులు
నిన్ను చూచి పులకిస్తాయి
నీ ఆత్మీయతను అభినందిస్తాయి
అంతెందుకు, నేడు
కళా వేదికలన్నీ
నీ కలలే కంటున్నాయి
నీ రాకతో ఊపిరి పీల్చుకుంటున్నాయి

శిధిలమై పోతున్న
భారతీయ సామాజికస్పృహను చూచి
మధన పడే హృదయం నీది
ధనంకన్నా త్యాగదనం మిన్న అని
విశ్వసించే వితరణ వీరత్వం నీది
సత్కార్యాలను ప్రోత్సహించే
నిర్మల ధర్మకర్తృత్వం నీది
అందుకే, ప్రతిభకు నీ వంటే ప్రాణం
ప్రగతిది నీ వెంటే ప్రస్థానం

కవి పండితులతో స్నేహం
నీ కళారాధనకు చిహ్నం
నిస్సంగత్వానికి, నిర్మోహత్వానికి
నిశ్చల తత్వానికి
నీ సంత్సాంగత్యమే సాక్ష్యం
ఆదిశంకరుల అద్వైతమే
నీ పరోపకార లక్ష్యం

అబూశైల శిఖరాలమీద జ్ఞానసరోవరంలో
విరిసిన "బ్రహ్మకుమారీ" రాజయోగత్వం
"ఈశ్వరీయ విశ్వవిద్యాలయ" తత్వం
నీ సుగుణ సుందర వ్యక్తిత్వాన్ని
చూచిచూడగానే గుర్తించాయి
సత్యసాయి ప్రశాంత నిలయం
నీవు దర్శించే ప్రతి దేవాలయం
నీ భక్తి ప్రపత్తులను హర్షించింది

నీ జాతకచక్రం వేసిన
విధాత సంకల్పం ఏమిటో!
నీ జీవితచక్రం త్రిప్పిన అర్ధాంగిని
నీకు "హర్ష విజయం" ప్రసాదించిన శుభాంగిని
నీ పరిపూర్ణ జ్ఞాన "సుధా"ంగిని చేశాడు
కనిపించి కనుపించనట్లు
నీ త్రికరణాలలో లీనం చేశాడు
నీ జీవితాదర్శ గీతికి
ఆమె నిర్మల ప్రేమానుభూతిని
పల్లవి చేశాడు

శతాధిక వసంతాలను
తన వెంట తీసుక పోయిన నీ తండ్రి
నిన్ను మహోన్నత శోభాశిఖరాలకు చేర్చే
పూలబాట పరచి పోయాడు
దివినుండి దీవిస్తున్న మాతృమూర్తికి
నీ విజయవార్తలు వినిపించబోయాడు

నీ వంటి పుణ్యపురుషులతో
ధన్యజీవులతో
పంచుకున్న కష్టసుఖానుభూతుల
కావ్యం ఇది
విస్తరిస్తున్న నీ సత్కీర్తి వృత్తంలో
వెలిగిస్తున్న నాదబిందురూపం ఇది
అవధిలేని మన ఆత్మీయతలకు
ఆరిపోని కళాదీపం ఇది
"స్వీకారం" తెలుపవయా
నీ చిరునవ్వుల భాషలో
"శ్రీకారం - ఓంకారం" నినదించే
శబ్దాతీత పరిభాషలో

హైదరాబాదు - జె. బాపురెడ్డి
3.8.1999

# నానా మిత్ర సందర్శనం

— ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

డా॥ బాపురెడ్డిగారి 'ఆత్మీయ రాగాలు' ఒకనాటి తిరుపతి వేంకటకవుల 'నానారాజ సందర్శనానికి' మరోరూపంగా కనిపించింది. ఇదొక 'నానామిత్ర సందర్శనం' అనవచ్చునేమో అనిపించింది. జంటకవుల కవితలు తెలుగుపద్యాలలోనే వెలువడ్డాయి. బాపురెడ్డిగారి కవితలు ఉభయకవిమిత్రుల జాడల్లో నడిచాయి. అటు పద్యం - ఇటు వచనగేయం విడదీయలేని జంటలా చెట్టపట్టాలు పట్టుకొని ఇందులో రెండు రంగాలు నిర్వహించాయి. అంటే, ఒకే కవి జంటకవుల పాత్రను నిర్వహించి 'బాపురే' అనిపించుకొన్నాడన్నమాట.

మంచి కవి కావటం ఎంత గొప్పో! మంచి మనిషి కావటం అంతకంటె గొప్ప. నన్నయ ఎంతటి 'విపులశబ్దశాసను'డైనా, ఎంతటి 'ఉభయభాషాకావ్యరచనాభిశోభితు' డైనా ఆయన 'సుజనుడు'. సుజనుడైన సుకవి దొరకటం సాహిత్యం చేసుకున్న పుణ్యం. డా॥బాపురెడ్డి అటువంటి సుజన సుకవి.

అందుకే ఆయన కందరూ సుజనుల్లాగానే కనపడతారు. శత్రువులో కూడా సుగుణాన్ని చూచే సుజను డాయన. మనిషికీ మనిషికీ ఉండే సంబంధంలో స్వార్థంకంటె స్నేహానికి ఎక్కువ విలువనిస్తాడు. కావ్యం అంకితం చేయటానికి కనకం కాదు ఆయనకు ప్రమాణం; కమ్మని ఆత్మీయత. ప్రశంసించటానికి పదవులు కాదు ఆయనకు ముఖ్యం; మనిషిలోని మంచితనం. స్మృతికవిత రాయటానికి మరణించినవాడు మనవాడా కాదా అన్నది కాదు ఆయన లెక్క పెట్టేది; మనసుతో జీవించాడా లేదా అని. బాపురెడ్డిగారు బలే కలుపుగోలు మనిషి. స్నేహంకోసం వారు చూపే చొరవ ఒక మానవమూల్యంలా మహనీయంగా సాటివారిచేత మన్ననలను పొందుతుంది. తనచుట్టూ ఉన్న సమాజంలో స్నేహసంబంధాలకోసం తాపత్రయపడే కవిహృదయమే బాపురెడ్డిగారు. అందువల్ల వారి కవిత్వానికి స్నేహం ప్రాణం. స్నేహంతో మనుషులను ఎలా బాపురెడ్డిగారు కౌగిలించుకొంటారో ఆయన కవిత్వంలో కూడా విశిష్టపదబంధాలు, భావచిత్రాలు,

అనుభూతిని, భావనాశక్తిని అలా కౌగిలించుకుంటాయి. బాపురెడ్డిగారు నమ్మిన స్నేహితుణ్ణి వమ్ముచేయరు, మోసం చేయరు. అవసరం వస్తే అతనికోసం తాను నష్టపోతారు, కష్టాలను కొనితెచ్చుకొంటారు. ఆ మంచితనం ఆయన జీవితంలో శ్రీచందనంలాంటిది. చందన వృక్షానికి ఒక్కోసారి పాములు చుట్టుకొనే బాధ కలగవచ్చు. కానీ, పాముకు కూడా పరిమళాన్ని అందించే సుగంధవృక్షం బాపురెడ్డి కవితా వ్యక్తిత్వం. అందువల్ల - పాములుకూడా ఆయన్ని చివరకు ప్రేమించి, గౌరవిస్తాయి. బాపురెడ్డిగారి మిత్రులకందరికీ ఈసత్యం తెలుసు. కానివారికి కూడా ఆ వాస్తవం తెలుసు. అందుకే ఆయన బహుజన మిత్రుడు, బహుగుణ మిత్రుడు. ఆయన గళమెత్తితే స్నేహగీతి వెలువడుతుంది గాని ద్రోహగీతి వెలువడదు. అందువల్లనే ఆయన కవితలు 'ఆత్మీయరాగాలు'. అంటే - ఒక అర్థంలో ఆయన మనసులో మానవతమీద ఉన్న తనదైన అనురాగ భావనలు. మరో అర్థంలో ఆయన అంతరంగంలో ఆత్మాశ్రయంగా ఉన్న స్నేహానురాగభావనలు. మరింకో అర్థంలో - కవియొక్క ఆత్మను కదిలించగలిగిన స్నేహమాధురులు. ఇంకో అర్థంలో - బాపురెడ్డిగారి వ్యక్తిత్వంలో చెప్పుకోతగ్గ ముఖ్యమైన స్వభావం స్నేహం. దానినుండి పుట్టిన మధుర స్వరాలే ఈ ఆత్మీయరాగాలు.

'నీ మిత్రు లెవరో చెప్పు నీ జీవిత చరిత్ర రాస్తాను' అనే సూక్తి ఇంగ్లీషులో ఉంది. ఈ సంపుటిలో ఉన్నవారందరూ కవికి ఆత్మీయులే, మిత్రులే, గౌరవనీయులే. అందులో కొందరిని ఆయన ప్రత్యక్షంగా చూచి ఉండవచ్చు. చూడకపోయి ఉండవచ్చు. కవి స్నేహితులుగా కవితల్లో నిలిచినవారు కాలాతీతవ్యక్తులౌ తారన్న అనుభవాన్ని అందిస్తారు; అక్షర తేజాలుగా నిలుస్తారు. బాపురెడ్డిగారి కవితలు బాపూజీనుండి తమ మనుమడు 'రసిక్' వరకూ వ్యాపించి ఉన్నాయి. ఆయన ప్రేమించిన స్నేహమూర్తుల కోసం ఆలపించిన రాగలహరి - ఈ కవితా ఝరి.

దాదాపు నాలుగు దశాబ్దాలుగా రచించిన కవిత లిందులో ఉన్నాయి. ఇందులో దేశవిదేశాలకు చెందిన మిత్రులున్నారు. వివిధ సన్నివేశాలలో చిత్రించిన కవిత లిందులో చోటుచేసుకున్నాయి. స్తుతి కవితలు, స్మృతి కవితలు కూడా కలిసి మెలిసి

ఉన్నాయి. స్తుతిలోనూ, స్మృతిలోనూ స్నేహసంస్కృతి ప్రతిఫలించటం విశేషం. అందుకు ఈ కవితల్లోని ప్రత్యక్షరం ప్రమాణమే!

ఇది 'నానామిత్రసందర్శనం' అన్నాను. మిత్రుడంటే సూర్యుడనే అర్థం కూడా ఉంది. ఇందులో ఉన్న మిత్రులందరూ కవి గాంచిన రవులు. అక్షర తేజోమూర్తులు.

సాహిత్య చరిత్రలో తమ మిత్రులకు పట్టం కట్టిన కవులు కొందరే ఉంటారు. నన్నయ తిక్కనాదుల మిత్రులు ఒకరిద్దరే వినపడతారు. శ్రీనాథుని మిత్రులు మిక్కుటంగా కనపడతారు. ఇలా ఒక కవిచుట్టూ ఒక మిత్రలోకం సౌర కుటుంబంలాగా వెలుగుతూ ఉంటుంది. ఆలోచించి చూస్తే బాపురెడ్డిగారికున్న మిత్రబలగం సమకాలీన కవుల్లో మరెవరికీ లేదేమో! దానికి ఈ ఆత్మీయరాగాలే అక్షర సాక్ష్యాలు!

మిత్రత్వానికే మిత్రత్వం నేర్పిన కవిరవి డా॥ బాపురెడ్డి! మిత్రత్వానికి అమృతత్వం అందించిన ప్రేమమూర్తి శ్రీ యస్. కొండలరావుగారు. మిత్రత్వం అమృతత్వాని కిచ్చిన స్నేహోపాయనం ఈ మధుర కవితా సంపుటి.

'ఆత్మీయరాగాలు' ఈ తరం స్నేహగీతి. సమకాలీన కవితలో సకృత్తుగా కుదిరే రాగమంజరి. మిత్రులు బాపురెడ్డిగారికి హార్దికాభినందనలు.

# ఆత్మీయ స్పందనలు

— జె. బాపురెడ్డి

ఇది ఒక అపురూప కావ్య సంపుటి. రాయాలని పనిగట్టుకొని ఏదో ఒక ఇతివృత్తం తీసుకొని రచించింది కాదు. ఏదో ఒక నియమిత కాలంలో చేసిన రచన కూడా కాదు. దాదాపు గడచిన నాలుగు దశాబ్దాలుగా (1960-1999) వరకు, నేను ఆయా ప్రత్యేక సందర్భాలలో కొందరు విశిష్టవ్యక్తుల గురించి అభివ్యక్తం చేసిన కవితా స్పందనల సంకలనం ఇది. పైగా ఏదో ఒక 'ప్రక్రియ'లో వ్రాసినవి కూడా కావు. ఇందులో మాత్రా ఛందస్సుతో కూడిన గేయాలు ఉన్నాయి- సంప్రదాయ ఛందస్సులలో వ్రాసిన పద్యాలు ఉన్నాయి. అలాగే ఆధునిక ప్రక్రియగా వర్థిలుతున్న, "వచన కవితలు" కూడ ఇందులో చోటు చేసుకున్నాయి. ఈ మూడు దేని కది వరిష్ఠమైనవే. అందుకే వీటిని మూడు విశేషధారలుగా విడదీసి చేర్పడం జరిగింది. ప్రతిభాగంలో సాధ్యమైనంతవరకు రచనా కాల క్రమంలోనే అవి కూర్పబడ్డాయి. స్థూలంగా ఈ కవితలు ఈ దిగువ చూపిన సందర్భాల్లో వ్రాసినవి.

(1) నా కృతులు అంకితం తీసుకున్న స్వీకర్తల గురించి.

(2) మహనీయుల జన్మదినోత్సవాలు షష్టిపూర్తివంటి శుభ సందర్భాల్లో

(3) ఆత్మీయులకు ప్రతిభాపురస్కారాలు ప్రదానం చేసినప్పుడు....

(4) విశిష్ట వ్యక్తుల జయంతులు, వర్ధంతులు జరిగినప్పుడు..

(5) త్యాగమూర్తులు, దేశభక్తులు, మాన్యులు దివంగతులైనప్పుడు...

అంటే, ఆత్మీయమైన, వైయక్తికమైన ఆనందాలను, ఆవేదనలను, అనుభూతులను, కళాత్మకంగా భావనాత్మంగా మలచిన కవితాశిల్పాలను ఒక చోట చేర్చి కూర్చిన పవిత్ర భావ చిత్ర ప్రదర్శనశాల ఈ కావ్యమాల. అయితే ఇందులో చోటు చేసుకున్న వారు, నా అగణిత ఆత్మబంధువులో గణనీయమైన కొందరు మాత్రమే. నాకు తెలిసినంతవరకు ఇది ఒక ప్రయోగాత్మక ప్రథమ ప్రక్రియగా భావిస్తున్నాను. సహృదయులందరి ఆదరణకు పాత్రమౌతుందని ఆశిస్తున్నాను.

ఆప్తమిత్రులు శ్రీ సారిపల్లి కొండలరావు గారు నేటి స్వార్థపూరిత సమాజపు ఎడారిలో అక్కడక్కడ వెలుస్తున్న ఒయాసిస్సుల వంటి త్యాగధనులు వితరణ శీలురలో అగ్రగణ్యులు. వారు విజ్ఞాన కళారంగాలకు అందిస్తున్న నిస్వార్థ సేవలకు అభినందనగా నా పట్ల చూపుతున్న వాత్సల్యాభిమానాలకు కృతజ్ఞతాసూచకంగా ఈ కృతిని అంకితం చేస్తున్నాను.

మరుపురాని ఈ రసాత్మక సన్నివేశం, విశ్వవిఖ్యాతలు నాకు అత్యంత గౌరవపాత్రులైన జ్ఞానపీఠ పురస్కృతులు ఆచార్య సి.నారాయణరెడ్డి, డా. సీతాకాంత మహాపాత్ర, కేంద్రసాహిత్య అకాడమీ కార్యవర్గసమితి సభ్యులు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, డా. వాసిరెడ్డి సీతాదేవి, డా. వుండేల మాలకొండారెడ్డి, డా. *M.S.* రెడ్డి, డా. *B.N.* రెడ్డి వంటి సాహితీమూర్తులు సమక్షంలో జరగడం అదృష్టంగా భావిస్తున్నాను. ఈ సందర్భంలోనూ శ్రేయోభిలాషులైన ఆప్తమిత్రులందరికీ ముఖ్యంగా శ్రీయుతులు *P.* సుదర్శనరెడ్డి, *M.S.* మూర్తి, *A.V.S.* రాజు, *S.* రాధాస్వామి, *G.S.* ప్రకాశరావు, *P.* మహేందర రెడ్డి, *J.* మారుతి, *Y.K.* నాగేశ్వరరావు, *M.K.* రాము, ఆచార్య *S.S.* ప్రభాకరరావు గారలకు నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

ఇటు గుంటూరులో ఉన్న వదాన్యులు జనాబ్ అజీజుల్లాఖాన్ మొదలు అటు అమెరికాలోని ప్రవాసాంధ్రులు శ్రీమతి రాధికా-బాలాజీ దంపతుల వరకు, ఆస్ట్రేలియాలోని 'తెలుగు పలుకు' శ్రీ *T.* నారాయణరెడ్డి మొదలు, ఇంగ్లండులోని మహామనీషి శ్రీ *D.* సుబ్బిరెడ్డి వరకు దేశవిదేశ మిత్రులెందరినో నేను పేరు పేరున తలచుకొని నాలో నేను పొంగిపోతున్నాను. వారందరికీ కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

తన అనన్య సామాన్యమైన ప్రతిభా పాండిత్యాల పరిమళంతో ఈ పుస్తకానికి తిలకం దిద్దిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. శ్రమకోర్చి ఈ కావ్య సంకలనం ప్రచురించిన, జూబిలీ పబ్లికేషన్స్‌వారికి, ముచ్చగా ముద్రించిన విప్లకంప్యూటర్ సర్వీసెస్ వారికి ప్రశంసాపూర్వక ధన్యవాదాలు. నిరంతరం నా సాహితీ యాత్రలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్న నా జీవితేశ్వరి రాజేశ్వరికి నా ఆశీస్సులు, అభినందనలు.

# విషయసూచిక

పద్యధార

## వచన కవితాధార

జె. బాపురెడ్డి

# చైతన్య రేఖల్లో సినారె

నారాయణరెడ్డి కవీ!
నవ్యగేయ మహాకవీ!
ఆంధ్రుల హృన్నీరేజము
లందు వెల్గు కళారవీ!

నాలో పూచిన చైతన్య రేఖలను కూర్చి నీకు
అర్పించుచునుంటి నిదే అందుకొనుము సుహృన్మణీ!
మన చిరమైత్రీసౌధమ్మున నిది దివ్య దీపమై
వెలుగుగాక! మింట ఉడులు వెలుగుదాక తరిగిపోక.

నవ్వనిపువ్వుల పాటల నవ్వులు రువ్వితివి నీవు
పుట్టగానె పరిమళించినట్టి పువ్వు వైతి వీవు

"మేమూ మానవుల" మనే ఈమాటను మరవకు డను
సామాన్యుని సందేశము శంఖమెత్తి చాటినావు
శశిరాసుర హృదిని ప్రేమ చివురించగ పాడినావు
సమతకు మానవతకు సుస్వాగతములు పలికినావు.

బ్రతుకులోతులలో దూరి, ప్రకృతిసుందరతల నేరి,
వినోదమ్ము విజ్ఞానము, మనోజ్ఞముగ గ్రుచ్చి కూర్చి
అమృత కావ్యములుగ మార్చి, ఆంధ్రుల కర్పించినట్టి
నీ కీ చిరుకావ్య మిచ్చి, నేడు నేను ధన్యునైతి.

నీ ఊహోన్నతుల ముందు నింగికూడ క్రుంగిపోవు
నీ భావగభీరతలకు నీరధులే లొంగిపోవు
నీ శబ్దమహత్తున భాషాశక్తులు పెరిగిపోవు
నీ గేయము విన్నప్పుడు మా గుండెలు కరగిపోవు.
అనుభూతిని దాచుకొనని అమృతాత్మ మహానుభావ!
ఇదె గైకొనుము నా అమాయికయగు కావ్యకన్యకను.

మతము పేర మానవ జీవిత సుఖములు బాసినట్టి
కళకోసరమై అనురాగములకు దూరమైనట్టి
ఇక్ష్వాకులనాటి బౌద్ధభిక్షువు లగు శాంతిశ్రీ
పద్మదేవ ప్రణయగాథ, వారి వలపు వెదలబాధ
'నాగార్జున కొండ' ల మార్మ్రోగగ విని, వినిపించిన
నీ గానము నాగార్జున సాగరమై నిల్చిపోయె
నీ కావ్యకళోర్మికలకు నిత్యనిలయ మైపోయెను.

వ్యక్తికన్న సంఘము ముఖ్యమ్మను మహదాశయమున
'తన్ను ప్రాణమునకంటెను మిన్నగ నమ్మిన రాయని'
విడిచిన 'లకుమా' హృదయము విరియవేసి నీలో చూప
కర్పూర వసంతమ్మును, కమ్రకావ్య సౌరభమును,
కావ్యారామమ్మున చక్కని అమ్లాన సుమమ్మును.

ధర్మరక్షణకై తన తలిదండ్రులనైన ఎదిరించు
'విశ్వనాథనాయడు' నిను వీర కరుణ రసాంబుధుల
ముంచియెత్తి గేయబ్రహ్మమును నీలో పలికించెను.

ఇంక మహోజ్జ్వల కావ్యము లెన్నెన్నొ పలుకవయ్య
ఆంధ్రసాహితీ జగతిని అభ్యుదయము చిలుకవయ్య
సరసకవీ! ఈ కన్యను స్వాంతములో నిలుపవయ్య
నారాయణరెడ్డి కవీ ! నవ్యగేయ మహాకవీ !

*(నా మొట్టమొదటి కావ్యం "చైతన్యరేఖలు" (1960) అంకితం)*

* * *

# జవహరులాలు

ఓ భారతదేశ మూలస్తంభమా
ఓ మానవజాతి శాంతి బింబమా!

ఒరిగిపోతివా నేడు నేలకు?
తరలిపోతివా స్వర్గసీమకు!

జోహారులు జోహారులు జోహారులు నెహ్రూజీ
సర్వమానవుల శ్రద్ధాంజలు లివిగో పండిత్‌జీ!
విశ్వజనాశాజ్యోతిని విషవాయువు లార్పెనా
పుడమితల్లి హృదయంలో బడబాగ్నులు నించెనా!

గగనలక్ష్మి దుఃఖమేఘముల దేలి విలపించెను
మానవతయు సమానతయు దీనముగా శోకించెను
నీకు ప్రియమ్మౌహిమగిరి నీరాజనమిడెను నీకు
నేడు నదీనదములు కన్నీటి గంగలై పోయెను

ప్రతిదేశపతాకలు క్షోభాభరమున వంగిపోయె
ప్రతిజీవనరంగము పేదతనమ్మున క్రుంగిపోయె
బాలబాలికలు 'చాచాజీ' లేదని విలపించిరి
పూలు గులాబీలు నీవరాల నవ్వులేక వాడె!

నీవు లేని భారతమ్ము నే విధి ఊహింతుమయ్య
నీవు లేని ఢిల్లీపురి తావి లేని పూవయ్యెను
నీ జీవిత లీలామృత నీరధి వర్ణింప తరమె
నీ వియోగబాధ నుడులలో వివరించుట వశమా!

ఎవ రోదార్చెదరు మమ్ము
ఈశ్వర నిభుడౌ ప్రియతమ
నాయకరత్నమును కోలు
పోయిన ఈదౌర్భాగ్యుల!

కనులకు కన్పడవు గాని
కలవు నీవు జగ మెల్లెడ
పలకలేవు గాని ప్రగతి
పథము చూపుచుందు వెపుడు

ఆ సంద్రములందు, నదులయందె కాదు నీమహాత్మ
కలిసిపోయె దేశకాలముల జీవితనదుల కూడ
నీ ఆశలు ఆశయములు నెరవేర్చ, ప్రయత్నింతుము
స్వాతంత్ర్య సమైక్యతలను శాంతిని పరిరక్షింతుము

ఇంతకన్న నీదివ్యస్మృతి కేమిటి
ఈయగలము?
దీవించుము మమ్మెవ్వరు
దివ్యలోక భూషణమా!

*(1964 మే 27న భారతరత్న నెహ్రూజీ అస్తమించినపుడు కురిసిన అక్షరాశ్రువులు)*

* * *

# మార్గదర్శి గురజాడ

నూరు వత్సరములకు పూర్వము
భారత జీవితకళాసం
జీవిగా, గురుజాడ అప్పా
రాయ! వెలసితివి

పుట్టగానే పరిమళించిన
పూవువై సాహిత్య సుగతిని
నిత్యనూతన సౌరభమ్ముల
నింపిపోయితివి

దేశమంటే మట్టి యనుకొని
మోసపోయిన భరతజాతికి
దేశ మంటే మనుషులని సం
దేశ మిచ్చితివి!

ఆడబిడ్డల అమ్ముకొను సం
ఘమ్మునకు తగుబుద్ధి చెప్పగ
సృష్టి చేసితివయ్య కన్యా
శుల్క నాటకము

ఛాందసముపై గ్రాంథికముపై
సాంఘిక దురాచారములపై
కత్తిగట్టి తెలుంగుజాతికి
ఖ్యాతి గూర్చితివి!

వేషభాషలు మార్చి మోసము
చేసి బ్రతికే స్వార్థపరు లు
న్నంతకాలము మరువ గలమా
నీ గిరీశమును?

ఆత్మీయ రాగాలు

ప్రభువులకు ప్రాణమిత్రుడవై
ప్రజలకే ప్రాణ మిచ్చితివి
లక్ష్మికాదని నవ్యవాఙ్మయ
లక్ష్మి గొల్చితివి!

నీవు పుట్టిన రాయవరము
నీవు మెట్టిన విజయనగరము
నీ యశస్సు విధాననే ఎ
న్నేళ్లయిన నిల్చున్

నాల్గు కోట్ల తెలుంగుప్రజ లీ
నాడు తమ "జాతీయకవి" నీ
వే యటంచును దశదిశల ఎ
ల్గెత్తి పాడుదురు

అఖిలమానవ హృదయ సీమల
ఆవరించిన నీ మహాత్మకు
ఏమి ఇత్తును నీకు నచ్చే
ఈ సరాలు వినా!

*(గురజాడ శతజయంతికి గుచ్చిన ముత్యాలసరాలు)*

* * *

# లాల్ బహదూర్

నడిరాతిరి నీ జాతిని విడిపోయితివా!
ప్రతిగుండియలో దీపము ఇడి పోయితివా!

అణ్వాస్త్రమ్ములను మించు ఆత్మబలమ్మును వహించి
కాలచక్రమును త్రిప్పిన లాలుబహదూర్ శాస్త్రీ!
జోహారులు, జోహారులు జోహారు లివే
శోకావృత లోకాదృత జోహారు లివే

తల్లి భారతిని సతీమతల్లిని లలితాదేవిని
భయశంకాశోకజలావర్తమ్మున త్రోసి నీవు
నడిరాతిరి --------
నెహ్రూజీ అస్తమయము నించిన నిస్సహాయతా
తమమును దిగమ్రింగి, అమృతధారలు వెలియించినావు
జయ కిసాన్ జయ జవాన్ జయగర్జా రవములతో
శౌర్యాగ్నులు రేపి భరతజాతికి విజయము కూర్చి
నడిరాతిరి ---------

కనులకు ఐదడుగు లెత్తు కనిపించిన నేమి నీవు
ప్రతిభాద్యోశిఖరముపై ప్రజాశక్తివే అయితివి
''తాష్కంట్'' లోన శాంతి తపసు చేసి
మానవతాతీతోన్నతి నంది
స్వర్గతీర మెగసి పోయావా!

బద్ధశత్రు వన్నవాడు
పరమమిత్రు డైనవాడు
వంచినారు శిరములు నీ
పార్థివ దేహము నెత్తి

మంచిని ప్రేమించినావు
మనిషిని ప్రేమించినావు
నిను ప్రేమించిన భరతావనికై
బలియైనావు

నిన్ను కోలుపోయినట్టి
నరలోకము పేద వడెను
నిన్నుకూడ పొందినట్టి
సురలోకము ధన్యమయ్యె
'తాష్కంటు'
నీ మహోజ్జ్వలాశయ శాంతిస్తంభము
నీ దివ్యస్మృతి మా కిల
నిత్యోదయ రవిబింబము!

*(1966లో వీరవిజయ యోధుడుగా భారత ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి స్వర్గస్థులైనప్పుడు)*

* * *

# కావ్యకళ్యాణం

నీవు వరుడ వౌటకు ఏ దేవతలను కొలిచినదో
నా ఈ నవకావ్య వధువు
ఓయి బోయి భీమన్నా!

పాండిత్యము రసతత్వము
ప్రగతి సాహితీ సత్వము
అకృతి గొన్నట్టి అక్షరాకారా ! సాకారా

గోదావరి తీరంలో గోపాలడవై పుట్టి
ప్రకృతిదేవి ఒడిబడిలో పంచాక్షరి వైనట్టి
నీవు వరుడవౌటకు........

జానపదుల జాగృతికై జాబులు పంపించితివి
మధుబాలకు రాగోదయ మధుగీతం మప్పితివి
పాలేరును ప్రభువుచేసి కూలీనే రాజు చేసి
సభలు చేసి భావ దీప విభవము చూపిన వాడా!

అరు ఋతువులందలి ప్రహ్లాదరాగమధువు తీసి
ఏడవఋతువును చేసి ఏలిన రసలో కేంద్రా!
ప్రబల భావనా రాకెట్టు పై అనాది కొసనుండి
అనంతత్వమెల్ల ప్రదక్షిణ చేసిన రాగఋషీ!

కొండలు మానవ లోకపు గుండెలు
చైతన్య సుధా భాండములౌనటు
అకాండ తాండవ మొనరించునట్టి
నీవు వరుడ వౌటకు....

సకలతత్వ సారామృత సంభరిత కళా కలశీ!
వైతాళిక గానరాగ వైశాఖిని వరియించిన
నీవు వరుడ వౌటకు ఏ దేవతలను కొలచినవో
సద్గుణకావ్య  కన్య ఓయి బోయి భీమన్నా!

ఇది నా భావ తరంగిణి
ఇది నా గేయోత్పలిని
కలశోదధి కళానిధి
కల్యాణము కమ్ము సుఖీ!
ప్రతిభా కోదండరామ,
ప్రగతి యుద్ధగదాభీమా
భారతికై సర్వస్వము ధారపోయు గుణధామా!
మేలుకో!
మదనురాగ శ్రీవిభాత శ్రుతిగీతను
ఏలుకో!
మదనుభూతిక్ష్మా జాతను కృతి సీతను.

*("బాపురెడ్డి గేయాలు" 1968 లో మహాకవి బోయి భీమన్నకు అంకితం చేసినప్పుడు)*

* * *

# బాపూజీ!

ఉన్నాడు ఉన్నాడు బాపు
నిన్న నేడు రేపు ఉన్నాడు ఉన్నాడు
నీలోన నాలోన నిఖిలావనిలోన
శాంతికై క్రాంతికై సాగు యాత్రలలోన

జాతి భేదము లేని నీతి వర్తనలలో
మత విభేదము లేని హితబోధనలలో
ఉన్నాడు ఉన్నాడు బాపు.....

స్వార్థాల చెరవిడిన సత్యాల విడిపించ
సమరాల తడబడిన శాంతిని నడిపించ
ఉన్నాడు ఉన్నాడు బాపు......

బ్రతుకులో మనిషికి
వెతల, మానవతకు
ఆరని వెలుగుచూపు
అమర దీపము బాపు
ఉన్నాడు ఉన్నాడు బాపు
నిన్న, నేడు, రేపు
ఉన్నాడు ఉన్నాడు........

* * *

# కన్నీళ్లు

హేమంతా! కానబడవు
ఏమై పోయా వమ్మా!
ఆడబోయి దారితప్పి
అమరపురికి చేరావా!

అమ్మ ఏడుస్తున్నది రా
వమ్మా! బంగారు బొమ్మ
కల పోలికనైన వచ్చి
కన్నీరు తుడిచి పొమ్మా!

అమ్మమ్మ తాత నిన్ను
రమ్మంటున్నారమ్మా
తమ్ముడు, అన్నయ్య, అక్క
బొమ్మలు తెచ్చారమ్మా

నాన్న మీద అలిగి దాగి
నావా! కనరావా?
మామల మాటైన విని
మాయింటికి రావా!

*(1969 లో చిన్నారి హేమంత కన్ను మూసినప్పుడు)*

* * *

# అమెరికాలో అసీమోవు

అమెరికాలో అసీమోవు
అంతరిక్ష శిల్పి
దేశకాల దేవాలయ
ఆగమ శిల్పి

కలల శిలలు తొలిచి
కాంతి రేఖలుగా మలిచే
త్రికాల త్రిముఖాల
త్రిభువన భవన శిల్పి
జిజ్ఞాస ప్రజ్ఞాన ఉపజ్ఞా శిల్పి

ఊహల ఉలితో
వాస్తవికతను
చెక్కి చెక్కి ఆనంద
సోపానం నిర్మించే
సుస్మిత శిల్పి

విజ్ఞానపు వీథుల్లో
వేదాంతం బోధిస్తూ
నరనారాయణులు కలిసి
నడుపకయే నడుపునట్టి
మర్మచక్ర కర్మ ధర్మ
మాయారథ శిల్పి

* * *

## చుక్కల్లో ఉషశ్రీ

ఉషారాగమును
నిశా నాగములు
ఓర్వలేక మ్రింగినవి
కవి హృదయమ్మున
రవి హృదయమ్మున
కారు మబ్బు కమ్మినది

నేలతల్లి ఇటు
నింగితండ్రి అటు
క్రుంగి క్రుంగి ఏడ్చినవి

మమతల పూవుల
మనసుల తీవెలు
మసలి విధిని దూరినవి
ఎక్కడో వెలుగు
చుక్క పాపల
మరొక్క తార చేరినది
ఉషారాగమును....

*(1969లో కన్న బిడ్డ ఉషశ్రీ కన్ను మూసినప్పటి కన్నీటి చుక్కలు)*

* * *

# సరిలేని కేసరి

ఎవరయ్యా నీ సరి
హే! ఆంధ్ర కేసరి!
మరువదు నిన్నీ దేశం
టంగుటూరి ప్రకాశం

పొంగిన నీ గుండెముందు
వంగినది తుపాకి గుండు
వంగని నీ శిరము ముందు
ఁలొంగెను సామ్రాజ్యవాది

'స్వరాజ్య'రథము నడిపి
జాతిని మేల్కొల్పినావు
సర్వస్వము ధారపోసి
స్వాతంత్ర్యము తెచ్చినావు

త్యాగం సింహాసనముగా
ప్రేమము సౌభాగ్యంగా
ఏలుకొంటి వేలుచుంటి
నీ తెలుగు ప్రజల గుండెల

నిండెను స్వాతంత్ర్యరమకు
నేటికి పాతిక ఏళ్లు
పండెను నూరేళ్లు నీకు
పండుగ వేడుకలు మాకు

*(ఆంధ్రకేసరి శత జయంతికి ఎత్తిన గీతికా వైజయంతి) - 1972*

* * *

# ఆరని వెలుగు

ఆరిపోవని వెలుగు చిమ్మి
ఆరిపోయిన దీపికా
వాడిపోవని పూలు పూచి
వీడిపోయిన వల్లికా!

నిన్ను కన్నుల చూడలేదు
నీ వెలుగు చూచితి మహాత్మా!
బ్రతుకు తీవెను గంటి, నీ
నవభావ సుమగంధములు బాపూ!

పోరు బందరులోన నీవు పుట్టినప్పటి నుండి గాంధీ
పోరు సల్పితివయ్య భారత పారతంత్ర్యము తీరుదాక
కేలుసాచి మహోగ్ర సేనల దీలు వడగొట్టిన తపస్వీ
చేతికర్రను ఊపియే
జగజ్జేతలను తరిమిన యశస్వీ!

మాధవుడు మహమ్మదుడు ఒకడే
ఈశుడును ఏసుడును ఒకడే
లోకహిత జీవనఝరీ గమ్యాకర మ్మొకటేను అంటివి
మానవతకై నీవు నాటిన
మహిత సత్యాహింస వాటిక
కులమతత్వపు దానవత్వపు
క్రూరమృగముల పాలబడియెను

అంతరిక్షము గెల్చినాడు
అణువు డొక్కను చీల్చినాడు
మానవేంద్రు డదేమొ
హింసామకరి దంష్ట్రల చిక్కినాడు

స్వార్థమును సత్యముగ చూపి
శాంతి బ్రతుకున దుమ్ము రేపే
నాటకమ్ముల భూటకమ్ముల
వేటలా పుట ఎట్లు బాపూ!

ప్రేమ నా గస్వరము నేడు
ద్వేష సర్పమునకు రుచించదు
ద్వేష ఫణములు ప్రేమనే
దీవించినట్లు నటించి కాటిడు
సామభేదోపాయములచే
శత్రువులను జయింపవచ్చును
మిత్రరత్నములట్లు కులికెడు
శత్రువులను జయించుటెట్లు?
పాదరసమే మైలపడిపోయే
దినాలివి బ్రతుటెట్లు?
ఎవడు మనుజుడొ, ఎవడు దనుజుడొ
ఎవడు దేవుడు ఎరుగుటెట్లు?

అందరికి నీవన్న ప్రియమే, అందరికి నీవాక్కు లమృతమె
ఎందరికి నీ సత్య మార్గమునందు నడుతురొ నీవెరుగవే!
నీ స్మృతి ప్రభ మాసి పోవక నీ శ్రుతి సుమాల్ వాడిపోవక
లోకమును అభ్యుదయ శాంతి
వాకగా నడిపించు గాక!

*(గాంధీజీ దివ్యస్మృతి)*

* * *

# నరుడో నారాయణుడో

ఎగసిపోయితి ఎగసిపోయితి
ఎపుడు ఎగరని యంత దూరం
సింధువులు సేతువులు దాటి
చేరబోయితి క్రొత్త తీరం !

పాలసంద్రం వంటి నీరద
డోలికలలో ఊగిపోయితి
మృదుమధుర పవనాతి థేయుల
మెరపు నగవుల తేలిపోయితి
లోకమా సురలోకమాయని
లోచనమ్ములు విస్తు పోయిన
ఖండమందున కాలు మోపితి
కలను వాస్త వికతను చూచితిని

సీతనెప్పుడు విడని రాముని
చిన్ని మచ్చయు లేని చంద్రుని
రాజ్య కాంక్షే లేని రాజును
రాగ పీఠము మీద చూచితి

అతని చల్లని చూపులందున
అమృత హేమంతమ్ము వీచెను
అతని వెచ్చని స్వాగతమ్ముల
ఆమనులు అంచాలు పూచెను

అతని ప్రతి చిరునవ్వు లోన
సహస్ర సుమగంధాలు చిలికెను
అతని ప్రతి మృదు వాక్కులోన
సహస్ర రస గ్రంధాలు పలికెను

ప్రేమదండము పూని
హృదయారామ సీమల నేలు రాజు
రాజులును, దినరాజు బాపని
బ్రతుకు చీకటి బాపు రాజు
అతనికిని అతనునికి రూపమ్మందు అంతరమెంతొలేదు
కాని శీలమునందు
పూవిలుకాడు కాడాతనికి జోడు

అతని హస్తము అన్నపూర్ణ
ఆత్మమురళీ గాన ఘూర్ణ
నవ్య జీవన ప్రభా జనకుడు
నరుడొ నారాయణుడొ ఆతడు
వేణువైనా ఎడద మ్రోగెను
నా నవాక్షర గిరుల లోయల
ఉత్తరాంబుధి ! దక్షిణాంబుధి
ఉడు పథమ్మున కెత్తె ఊయల

*(1968 లో హాలెండంలో గీసిన, ఆత్మీయులైన డి. రామచంద్ర రాజు - అన్నపూర్ణ దంపతుల సుగుణ రేఖా చిత్రం)*

* * *

# బడెన్ పావెల్

బడెన్ పావెల్ సేవా భావరూపం
ఎందున్నావయ్యా నీవే మాకు దీపం

పవిత్రమగు పందొమ్మిది వందలేడునాడు
నీవుగన్న కలలన్ని నిజాలయ్యె చూడు

బ్రౌను కడలి దీవిమీద
ప్రభవించిన వెలుగు
నాలభటో ద్యమముగా
వసు ధెల్లెడ వెలుగు

ఖండ ఖండముల గుండెలు కలిపివేసి నావు
పసివారలలో అఖండ బలము పోసినావు

చెమిమి, మాకు కలిమి,
నీవు చెప్పిన హితమే మతం
సేవ, మాకుచేవ,
మేలు చేయుట మా జీవితం

కులమతాల అంతస్తుల
గొడవలేని విరులం
భరతాంబకు జగదంబకు
తరతరాల సిరులం

*(బాలభటోద్యమ స్థాపకుని పట్ల బాలభటుల అవ్యాజ స్పందనగా)*

* * *

# జాతీయ గీతకవీ!

జనగణమన అధినాయక
జాతీయ గీత కవీ!
దేశకాలాతీత
దివ్య భావ విశ్వకవీ!

నీ జయ జయ రావములే
మా జీవన శ్రుతులయ్యె
నీ స్వప్నము లే పండిన
ఈ స్వేచ్ఛా భారతము
సస్యశ్యా మలమయ్యె

వేదో పనిషద్రసాల
నా దాత్మ పికమలై
కనపడి కనపడని, సత్య కాంతి వీణ మీటినావు
రసాక్షరానంద వసంతాలు నాటి పోయినావు

శీతాచల శిఖరములై
గీతాంజలి పట్టినావు
నింగి నేల కలుపు, గాన
గంగా ఝురివై నావు

క్రాంతభారతి రథ
శాంతి కేతనము నీవు
మానవతా ప్రగతి చక్ర
సమతా చేతనము నీవు!

* * *

# వాల్మీకి వనితావతారం

శ్రీకార ఓంకార శిఖరాగ్ర వాసిని
అక్షరానంద లాస్యార్చన విలాసిని
శివనామ, శ్రీరామ చింతన తపస్విని
మొల్లను, స్మరింతు అరమోడ్చి నా కనులు
ఆ తల్లిని స్తుతింతు జోడించి నా చేతులు

నవరసభరితం - రామునిచరితం
ఎందరెందరూ వ్రాసిననూ
ఏఏభాషల ఏఏతీరున ఏ కాలం లో వ్రాసిననూ
తనివి తీరని జ్ఞాన సరస్వతి తపన గ్రహించిన ఆకవనిత
భక్తి ముక్తి ఆవేశం విరిసిన శక్తి మల్లికా పల్లిమతల్లి

తల్లి దండ్రులకు "మల్లి" యైనది
ఎల్ల జగాలకు "మొల్ల" యైనది
అక్షర గాత్రి అమృత నేత్రి
జీవిత యాత్ర పవిత్రమైనది
రామాయణ కవయిత్రి యైనది
స్త్రీ జాతికి సీతా జనయిత్రికి
శీతాచల గర్వోన్నతి అయినది
శివ సుందర సత్యాత్మ అయినది

పుబ్బనక్షత్రాన పుట్టినది మొల్ల
చిననాడె తల్లిని కోల్పోయె మొల్ల
తండ్రి కేసన సెట్టియే తల్లిగాను
పెరిగినది పెరుమాళ్ల బిడ్డగా మొల్ల
గండాల జాతకముకల దంచు ఎంచి
పెళ్లి మాటే తల పెట్ట లేదేమో
కన్యగానే నిలిచి పోయినది మొల్ల

శివభక్తి పరుడు కేసన సెట్టి ఇంట
శివశక్తి రూపమై చెన్నొందుచుంట
పరమశివ కైంకర్యమునకు అంకితమై
బసవిగా బ్రతుకంత గడిపినది మొల్ల
హరిహరుల వరప్రసాద మహత్తు వలన
ఇహపరానంద చేతన యయ్యె మొల్ల
వాల్మీకి వనితావతారమో మొల్ల !

ముద్దుల మూటలు - మొల్ల మాటలు
ముక్తికి బాటలు - మొల్ల పాటలు
పద్య కళాసుమ పరిమళ దీపం
ఆమె చూపిన ఆయోధ్య రూపం
రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు
అవతరించిన అయోధ్య నగరం

మొల్ల గంటమున పండిన స్వప్నం
భాషా యోష భావ విలాపం
ప్రజా రాజ్యలక్ష్మి దరహాసం

కులమత లింగ విభేదము లెంచని కోకిల గానం ఆమె
మల్లిని, కుమ్మరి మొల్లని పిలిచిన మారని మానవతామె !
ఊరేదైనా పేరేదైనా తీరం లేని నీరధి ఆమె
చరిత్ర కారుల విచిత్ర ఊహల కతీతమైన సత్యం ఆమె
దివిలో తల్లి భువిలో తండ్రి దీవించిన జీవితమామె !

*(మొల్ల రామాయణాన్ని ప్రసిద్ధ నృత్యాచారి శ్రీమతి సింధూరి (USA) గారి కోరికపై సంగీత నృత్య రూపకంగా నేను రచించినప్పుడు చేసిన కవయిత్రి మొల్ల సంస్మరణ గేయం)*

❋ ❋ ❋

# చిత్రము చిత్రము బాపూ!

చిత్రము చిత్రము బాపూ
చిత్రము నీ జీవితం
చిత్రము కురుక్షేత్రము
పవిత్రము నీ జీవితం

దక్షిణాఫ్రికాలో ధవళజాతి కుటిలనీతి
విలయతమో వలయంలో వెలిగిన ధర్మ జ్యోతి
చిత్రము చిత్రము .......

సత్యం, శాంతి, అహింస సాధనాలుగా చేసి
దాస్య జడధి ఎడదజీల్చి స్వాతంత్ర్యము తెచ్చినావు
చిత్రము చిత్రము ....

మనిషికి మనిషికి మధ్య మమకారం సహకారం
బోధించిన నీ తత్వం భువనానందా మృతం
చిత్రము చిత్రము ..........

సకలశాస్త్ర మతసారం త్రికరణ శుద్ధి అని
ప్రకటించిన పాటించిన ప్రగతియోగ యోగీశ్వర

నీ ఆశల అటన్‌బరో
నీ చేతల కిన్ స్లే
రూపించిన చలన చిత్ర రూపము
లో క విచిత్రం
జగశ్శాంతి హిత పత్రం
చిత్రం నీ జీవితం

* * *

# శ్రీ సామ్యుల్ హనేమన్

శ్రీ సామ్యుల్ హనేమన్! జోహారులు నీకు
హోమియోపతి పితా! ప్రేమాంజలి నీకు . . .

విజ్ఞాన తపస్వివి, విశ్వ విశాల యశస్వివి
ఆయురారోగ్యాల అశ్వినివి నీవు
నవవైద్య నారాయణావతారము నీవు
ఇంటింటిలోన శ్రీకారము నీవు . . .
జర్మనీలో నీవు జన్మించావు జగమెల్ల ప్రేమించి జీవించావు
దేశకాలాతీత సంజీవన సత్యాలు
శోధించి, సాధించి, బోధించావు . . .

సులభమౌ, సుభగమౌ, సత్వరమౌ, చౌకయౌ
రోగ నివారణ విధాన యోగము నీది
భద్రత గల చికిత్సా ప్రయోగం నీది
బాధ్యతగల సూక్ష్మబుద్ధి వైద్యం నీది . . .

గరళమైన నీవె మ్రింగి కష్టాలెన్నో సహించి
ప్రకృతిసిద్ధమైన వైద్యపద్ధతి కనిపెట్టినావు
శివంకరుడవైన రుజాసురాంతకుడవైనావు
సతి మేరీ మెలనీయుత ధన్వంతరి వైనావు

నీ జన్మదినం పవిత్ర పర్వదినం మాకు
నీ సంస్మరణం పూర్ణారోగ్యధనం మాకు . . .
తేలుకాటు, పాముకాటు, కుక్కకాటువంటి
విషపాతమునకు బలియౌ వేవేల అమాయకులను
రక్షించే ప్రాణదాన ఔషధాలు చేసి పల్లెపల్లెలో ఉచితముగా పంచే
ధర్మాత్ములు 'అశ్వినీ హోమియో' అధిపతులకు నేడు
ఆదర్శము, ఆధారము, ఆరాధ్యుడు నీవే

*(అశ్వినీ హోమియో వారి సభలో హనేమన్‌కు అక్షరాంజలి)* ❋ ❋ ❋

# అక్కయ్య - అన్నయ్య

అక్కయ్య అన్నయ్య ఎక్కడ ఉన్నా
బాలానందం వారికి అన్నిట మిన్నా -

బాల బాలికలు వారికి భాషలు భావాలు
బాల బాలికలె వారికి పూలు పరిమళాలు
బాల బాలికలె వారికి కలలూ నిజాలూ

నీతికథలు జాతికథలు
నిండుగుండెతో చెప్పి
చెప్పి చెప్పి కథలెన్నో చిన్నారులందరికీ
వారిబ్రతుకె అయిపోయెను
వాస్తవ ఆదర్శకథ

నడక నేర్చు పసికందుకు నర్తన నేర్పి
పలుక నేర్చు పాపాయికి పాటలు నేర్పి
మురిసిపోవు అక్కయ్య మోముకు జేజేలు
మెరిసిపోవు అన్నయ్య మనసుకు జేజేలు -

పిల్లల నాటకములతో
పెద్దలకే బుద్ధినేర్పి
బాల కళాకారులతో
భారతికే గద్దెవేసి
కామేశ్వరి అక్కయ్య రాఘవరావన్నయ్య
అపరసాంబశివులైరి ఆనందభవులైరి -

సంఘం బాలానందం - ధర్మం బాలానందం
బుద్ధం బాలానందం - శరణం బాలానందం

అక్కయ్యకు అన్నయ్యకు డెందం బాలానందం
ఆంధ్ర బాలానంద సంఘమె శరణానందం

జైజై బాలానందం
జై విజ్ఞానమరందం
జైజై మమతాబంధం
జై సమతాగంధం
జై బాలానంద సంఘ స్థాపక సందీపకులకు
స్వర్ణోత్సవ జయ హారతి సంస్కృతీ వ్యాపకులకు . . .

(రేడియో అక్కయ్య - అన్నయ్యకు నీరాజనం)

* * *

# ఏసు క్రీస్తు

పసుల పాకలో పుట్టిన శిశువు నీవు !
మరియమ్మ కలల తీవె విరివి నీవు !

బెత్లహాం మట్టిలో ప్రేమను పండించావు
అన్యాయాల ఎడారుల అమృతం కురిపించావు -
మనిషి మనిషిగా బ్రతికే మార్గం చూపెట్టావు

కామరూపి సైతానును
కనిపెట్టి జయించావు -

చుక్కవోలె ఉదయించి
సూర్యుడ వైపోయావు
దేవదూతగా వచ్చి
దేవుడ వైపోయావు -

పాపులను, పతితులను పరిశుద్ధులుగా మార్చి
రక్షకునే శిక్షించిన శిలువను పావనముచేసి
సత్యవాణి వైనావు
నిత్యదీప మైనావు -

మానవతను మతముచేసి
మనిషిని బైబిలుచేసి
దేశకాలముల వెలిగే
ఏసుక్రీస్తు వైనావు!

* * *

# పుట్టపర్తికి గేయ మాల

సత్యసుందర శబ్ద శైల శిఖరాలపై
శివతాండవ మ్మాడినాడు
అతడు నవనాదములు పాడినాడు -

సాహిత్యవీణా సరస్వతీపుత్రుడై
సంగీతగానగంగాఝురీగాత్రుడై
వేద విజ్ఞాన ప్రజ్ఞాన రస నేత్రుడై
విలసిల్లె పుట్టపర్తి నారాయణాచార్యుడై -

నరజీవనానంద నారాయణాత్ముడు
నాదబ్రహ్మోపాసనాచార్యు డతడు

సమదర్శి పుట్టపర్తి
సత్యసాహిత్యమూర్తి -

తెలుగుతల్లిని పిలిచి
భారతాంబను కొలిచి
లోకమాతను భక్తితో ఆత్మలో తలచి
తరియించిన కళాప్రపూర్ణుడు
జనహృదయ పద్మపీఠాసీనుడు

తత్వమై నిత్యమై మృత్యుంజయత్వమై,
సాగిపోయెడి మానవత్వమై స్తుత్యమై
రూపించె పుట్టపర్తి
దీపించె అతని కీర్తి !

*(డా. పుట్టపర్తి నారాయణాచార్యుల సంస్మృతి)*

* * *

# మతాతీత మనీషి

మతకలహం మ్రింగిందొక
మతాతీత మనీషిని
కత్తికాటు వేసిం దొక
కలమెత్తిన ఋషిని

మానవతా వాదానికి
ప్రాణం పోసిన మూసీ
తీరం కన్నీరయ్యెను
ఆరక్తపు ధారలో

మరుభూముల గుండెల్లో
మధుమాసం వెలిగించిన
లేగులాబి హాసంను
ద్వేషాంధం మ్రింగెనా

ఏకాకిగ ఉండికూడ
కోకిలయై పాడినాడు
త్యాగమె తన భోగముగా
తాదాత్మ్యము చెందినాడు

ఏవాసంతం కోసం
ఎలుగెత్తెను ఆ కోకిల
ఆ వసంతమే పికమై
అతని స్మృతిగీతి పాడు

*(1983లో మతోన్మాదానికి ఆహుతియైన యువకవి గులాం యాసీన్ స్మృతికి)*

* * *

# ప్రశాంత జీవనేందిర

ప్రశాంత జీవన ప్రదానేందిరను
నిశా చరిత మ్రింగినది
విశాల భారత దేశం నిండా
విషాదమే క్రమ్మినది

భారతరత్న గర్భంనుండి
పవిత్ర రక్తం చిమ్మినది
కలలు మేలు కొను కాలపు కన్నుల
కారు చీకటి క్రమ్మినది

దేశభక్తి పై త్యాగ శక్తిపై
ద్వేషం దాడి చేసినది
శాంతి కపోతిని ఆశా జ్యోతిని
స్వార్థం కూల్చి వేసినది

గంగా ఝురిలో గోదావరిలో
కన్నీటి అలలు పొంగినవి
అశేష మానవ హృదంతరాలు
ఆవేదనతో క్రుంగినది

స్వతంత్ర సమైక్య సమగ్రభారత
జాతి వైభవం నిల బెట్టాలి
త్రికరణ శుద్ధిగ అందురు
రక్షా దీక్షాంజలి పట్టాలి!

*(31-10-1984 నాడు భారతరత్న ఇందిరా గాంధి మతోన్మాదానికి ఆహుతియైనప్పుడు)*

* * *

# మీరాఖాన్

హాలండు నీతలపుల ఆమనిధామం
అందుకే ఈ కానుక ప్రేమా రామం

మీరాఖాన్ మేరీజాన్ ఏ పేరో నీ పేరు
మేరలేని స్నేహానికి పేరే నీ పేరు

నగరంలో నాగరికుడు
అడవిలోని ఆటవికుడు
నీ ఉపజ్ఞ యజ్ఞంలో
నిజరూప గుణ పాత్రలు

జీవసృష్టి రహాబాధ
జీవన పరిణామ గాధ
బోధ పడిన జన్యుశిల్పి
భూతల దివి నిర్మాతా!

విజ్ఞాన "ప్రభా" కలితా
విజయ సమీ రాహృతా
బాపురె ! భారతి భావి
దీపము నీ భావ గంగ

మైత్రీ రసరాగ నేత్ర
చైత్రోదయ గంధ గాత్ర
అక్షర సన్మాన పాత్ర
అంబత్రయ ప్రియ పుత్రా !

*(1986లో "ప్రేమారామం" గేయకావ్యం హాలెండును అలరించిన విశ్వ విఖ్యాత జన్యుశాస్త్రజ్ఞులు ప్రభావతీపతి ఆచార్య మీరాఖాన్ గారికి అంకితం చేసినప్పుడు)*

* * *

# ఒక తార

ఒకతార రాలిపోయింది
కాలచక్రము క్షణము ఆగిపోయింది -
వేల స్వప్నాలు తృటిలో కూలిపోయినవి
కారుచీకట్లలో కలిసిపోయినవి -

సిరిసంపదలకన్న స్వేచ్ఛయే మిన్నయని
స్వార్థ సుఖముల కన్న సేవయే శ్రేష్ఠమని
భావించినదిలే డయానా
జీవించినది నిర్భయాన -

రాణివాసము వీడి రాణించెను డయానా
పేదసాదల ప్రజల ప్రేమించెను డయానా
కోటికోటి ప్రజల నోటిలో కన్నీటి
పాటయైనది దయామయి డయానా -

చిత్ర ఛాయాచిత్ర జీవితయాత్రలో
తెలిసి తెలియని గమ్యమును చేరుకొనబోయి
దారిలోనే మాయదారి విధిచేతిలో
చితికిపోయిన యశోవతియే డయానా
మానవత రాజ్య యువరాణియే డయానా

ఛేమ్మునది ఒడ్డుపై
చరిత్ర గడ్డపై
వాడిపోవని పూలమేడయై పోయె
ఆరిపోవని దీపస్తంభమై పోయె!

*(డయానా స్మృతిగీతి)*

* * *

# మదర్ థెరెసా

మదర్ థెరెసా మన కిక లేదు
అయినా ఆమెకు మరణం లేదు -

నిరుపేదలకు, నిర్భాగ్యులకు
పరిచ్యుతులకు, బహిష్కృతులకు ఆర్తులకూ, అనాథలకూ
తల్లియైనది తండ్రియైనది వాస్తవ కల్పవల్లియైనది -

పుట్టినదేమొ యుగస్లోవియా
మెట్టిన మమతల మట్టి ఇండియా
కట్టెను సేవాదేవాలయమును కొట్టెను విశ్వప్రేమ గంటలు -

కలకత్తాలో కాలుమోపినది నిరాధారులకు దారిచూపినది
కుష్ఠురోగులను, కష్ట దష్టులను
రోగ పీడితుల, రుజాబాధితుల
వికలాంగులను, విధివంచితులను
ప్రేమామృతమిడి పెంచిన తల్లి ,సేవా సదనాన తరించిన తల్లి -

భారతరత్న ప్రభావిలసితయై నోబెల్ బహుమతికే విద్యుతియై
కులమత జాతి వర్గాతీత మానవతా కళ్యాణ దీపమై
వర్ధిల్లిన జయ వర్ధిని ఆమె శోభిల్లిన గుణసుందరి ఆమె!
సప్తసూత్ర సందేశ రాగమున, సుప్తజీవనుల మేలు కొల్పినది
కోటి కనుల కన్నీటిని తుడిచిన, మేటి మాత జనకోటి నోట
కన్నీటి పాటగా మిగిలిపోయినది -

*(భారతరత్న మదర్ థెరెసా స్వర్గస్థురాలు అయినప్పుడు)*

* * *

# పాటపై హత్యా ప్రయత్నమా!

పాటపై హత్యా ప్రయత్నమా
వెలుగు కోటపై తమసాధిపత్యమా!

శిశిరాల చేష్టలకు చరమగీతము పాడు
మత్తకోకిల కేమొ మరణ దండనమా!
జనవాణి వినిపించు రణనాద గళముపై
నిర్జీవ నిశ్చల నీరవ సమాధియా! -

దురిత దుశ్శాసన దుర్మార్గ పీడనల
ఎదిరించు పంచమశ్రుతికి వనవాసమా!
ఆ బాల గోపాల
మాదరించే అభయ
గీతికా యాజ్ఞానికే అసురభయమా! -

అరుణోదయమువైపు
చరణాల నడిపించు
పల్లవుల ఉల్లములపై శిశిర ఘాతమా!
త్యాగమే రాగమై
ఆగ్రహావేశమే అక్షర పతాకమై
ఉద్యమించిన బ్రతుకుపై అశనిపాతమా! -

*(గద్దర్‌పై హత్యా ప్రయత్నం జరిగినప్పటి స్పందన)*

* * *

# సత్యానికి హత్యాగండం

సత్యానికి హత్యాగండం ఉందని అనుకోలేదు
శాంతికపోతం విద్వేషానికి బలియౌననుకోలేదు
జరగకూడనిది జరిగింది - జాతికి శోకం మిగిలింది -

పెరంబుదూరున అమానుషత్వం
ఫెళ్లున ప్రేలింది
రాగంపండిన దేశంనిండా రక్తం చిందింది
లోకం నాకం ఒకే గొంతుతో
భోరున ఏడ్చింది

భారతయుద్ధంలో అభిమన్యుని కూల్చిన మాదిరిగా
రాక్షసశక్తులు కుట్రచేసి ఊహించనిచందముగా
రాజకీయపు దుర్వ్యూహంలో
రాజీవుని కూల్చె
ఉదయసంధ్యలో తరుణభానుడు ఒరిగి అస్తమించె

ఆ మహనీయుని చితాభస్మమును దాచిన నదులన్నీ
అందిస్తున్నవి అతని భావనలు
అలల పాటలల్లీ
అమరువీరుని అభయహస్తమే తోడునీడ మనకు
విజయపథంలో ఆతని గమ్యం
మనము చేరువరకు

*(రాజీవ్ గాంధి హత్యకు ఆక్రోశించిన హృదయావేదన)* -1991

* * *

# ప్రేమావతారుడు

శ్రీ శేషశాయి సాయీ !
శ్రీ సత్యశాయి సాయీ !
ప్రేమావతార సాయీ
భవ భయ విదూర సాయీ!

శ్రీపుట్ట పర్తీశ్వరా
శ్రీచక్ర వర్తీశ్వరా
ఇహపరానంద బృందా
దేహాత్మ సుమ మరందా ! - శ్రీశేషశాయి ।

కాంతి ప్రశాంతి నిలయా !
కరుణా సముద్ర హృదయా !
సర్వజన హిత బోధకా !
సర్వ సమ్మత సాధకా ! - శ్రీ శేషశాయి ।

సత్యం శివం సుందరం
నీదు త్రికరణ మందిరం
చిద్గోచర మగోచరం
నీ ప్రణవ తత్వ శిఖరం - శ్రీ శేషశాయి ।

కాషాయ వసనధారీ
నీలాకాశ వనవిహారీ !
ఆనంద బ్రహ్మ తేజా
అద్వైత సత్య భూజా ! - శ్రీ శేషశాయి ।

విద్య వైద్యారోగ్య
కల్పవృక్ష ప్రదాత
భక్త జన బాధా

విముక్త శక్తి ప్రదాత
దేశ కాలాతీత
సుఖ జీవన విధాత
శ్రీ సత్య సాయి బాబా
కలియుగ విజేత !

నీ జన్మదిన మహోత్సవ శోభ తిలకించి
నరులు, కిన్నెరులు, సురవరులు పులకించేరు
విరులు, మత్తెపుసరులు, అనురాగ రసఝురులు
శిరముపై ఉరముపై నీ అభయ కరముపై
చిరునవ్వు లొలుకు నిను చేరి కురిపించేరు

జయజయన్మంగళ
జయనాదములతో
సుందర శివసత్య
ప్రేమాభినయముతో ! - శ్రీ శేషశాయి ।

*(పుట్టపర్తి సత్యసాయి బాబా 70వ జన్మ దినోత్సవ సందర్భంగా)*

* * *

# జన్మసాఫల్యం

డెబ్బది వాసంతాల పబ్బమిది
పుట్టపర్తి చేసుకున్న పుణ్యమిది

వేదాలు సత్య ధర్మ
వాదాలు కలిసి మెలసి
ప్రశాంత నిలయము కట్టి
ప్రపంచాన్ని పాలించే
ప్రేమవిజయపర్వ మిది
సత్యసాయి వ్రతమిది ! - డెబ్బది ॥

చిరునవ్వుల దివ్వెలతో చీకట్లను తొలగించే
మౌన ధ్యాన తైలంతో మమత లెన్నొ వెలిగించే
బాధలను సుబోధలతో భస్మీపటలం చేసే
రాజహంస నడకలతో రసానంద మందించే
శాంతి దూత సాయి, జన్మసాఫల్యోత్సవ మిది - డెబ్బది ॥

కరుణామయ త్రికరణాలు
సానుభూతి సద్గుణాలు
సమతాదర్శన శక్తి భావభౌతికస్ఫూర్తి

ప్రతి మనిషికి ప్రసాదించు
ప్రభువు ప్రభవ దినోత్సవం
తేట తెనుగు మాటలతో
పాలవెల్లి పాటలతో
మనిషికి దేవునికి ఒకే మాతృభాష బోధించే
సత్యసాయి మహోత్సవం - డెబ్బది ॥

❊ ❊ ❊

# అభివాదములు

కవుల నాదరించి కావ్యముద్రణలకు
వలయు సాయ మిడెడివారు అరుదు
నేటికాలమందు, నీ వంటివారు ఒ
యాసిసులు ఎడారులందు బావ!

లక్ష్మికల్గియు సాహిత్యలక్ష్మిపై
గౌరవాదరణలు పెంచ గల్గినావు,
కర్మయోగివి సరస వాగ్ఝరివి నీవు
రాజగోపాలరెడ్డిబావా జయోస్తు!

మనపరస్పర రాగ నూతన సుమాలు;
మన చిరస్వప్న వాటి పండిన ఫలాలు;
మన్మనోమేఘ భావ శంపాచ్ఛటలు: మ
దీయ చైతన్యరేఖ లివే యశస్వి!

నాకు ధైర్యసంపద లిచ్చినావు నీవు
ఎంచలేని ప్రేమము కురిపించినావు
నేను నీకేమి అర్పింపలేను; సర్వ
దా కృతజ్ఞతాయుత మద్హృదయము తప్ప.

పుణ్యకార్యాల సాహితీ పోషణమ్ము
ఉత్తమము బావ! నా మాట చిత్తగించి,
తరుల పోషించు నవవసంతము విధాన
కవుల పోషించు మిల కలకాల మీవు.

*(నా తొలి గ్రంథము "చైతన్య రేఖలు" 1960లో ఒక ఆత్మీయుడు వెలిగించినపుడు)*

***

# నెహ్రూజీ

రాలిపోయెను విశ్వంభరా కిరీట
రమ్య నవ జీవన చ్ఛటా రత్న మొకటి
తడిసిపోయెను మానవతా కవోష్ణ
బాష్పములలోన నేడు నా భరతభూమి.

శాంతికి చిహ్నమై భరత జాతికి జీవన దాతయై జగ
త్క్రాంతికి హేతువై నవ శ కమ్మును నిల్పిన దివ్యభావనా
స్వాంతుడు ధర్మపాలకుడు పండిత జహ్వారులాలు- నేడు లో
కాంతర వాసి యయ్యె జగ మంత విషాద విశీర్ణమయ్యెగా!

భిన్న మత భిన్న భాషా విభిన్న సంస్కృ
తీ నిలయమైన భారతదేశ వాసు
లందరిని ఐక్యపరచు రహస్య బంధ
నముల కనుగొన్న నెహ్రూ లేడు మన కింక.

సర్వదేశ సమత్వ సహజీవన తటస్థ
నీతి నేర్పిన రాజనీతివేత్త
సకల ప్రజాభ్యుదయ కర ప్రణాళికా
సామ్య వాదార్థిక శాస్త్రవేత్త

విమల విశ్వప్రేమ విడని స్వార్థత్యాగ
ధనము పెంచిన పూర్ణతత్త్వవేత్త
మానవావళి మనో మౌన వేదనలకు
శాంతి గూర్చిన మనస్తత్వవేత్త

పండిత జవాహరుండు ముప్పాతికేళ్ళు
తానె భారత దేశముగాను, భరత
దేశమే తానుగాను వర్ధిల్లిపోయె
నెహురు ఇహపర పూజనీయ హరిహరుడు.

దేశం బంతయు ఆ మహామహుని సందేశంబు పాటించి, స్వే
చ్ఛా శాంతి ప్రగతి ప్రదీపన సుదీక్షాబద్ధులై నాయకా
ధీశుల్ పాలనసేయునట్లు మము ఓ దేవా! కటాక్షించి, పూ
ర్ణాశాభావము త్యాగశీలము, సమైక్య శ్రీలు చేకూర్చుమా!

*(27-5-1964నాటి వేదనా తరంగము)*

* * *

# సుభాసువాణి

చచ్చితి నంచు కొందరును చావగలే దని కొంద రెప్పుడో
వచ్చు నటంచు కొంద; రెటు వచ్చును చచ్చిన నంచు ఊహకున్
వచ్చిన రీతి ఎవ్వరికి వారు తలంతురు; నాకు అందరున్
నచ్చినవారె యౌట, పడి నాను విచిత్ర వివాద నీరధిన్.

చచ్చితినా లేదా, నేనే
ఖచ్చితముగ చెప్పలేను, కడలి కడుపులో
చొచ్చిన సూర్యుడు చచ్చునె?
చచ్చునె తమసాబ్ధి మున్గు చంద్రుడు చెపుమా!

చచ్చితి నందునా స్వాతంత్ర్య వీర జీ
వన భావనలలోన బ్రతికియుంటి
బ్రతికితి నందునా పారతంత్ర్యము పీల్చు
పచ్చినెత్తుటపడి చచ్చియుంటి
చచ్చితి నందునా స్వారాజ్యలక్ష్మి భా
రత సౌధ కుడ్యాల బ్రతికియుంటి
బ్రతికితి నందునా స్వార్థ సంకుచిత దం
ష్ట్రల చిక్కి ముక్కలై చచ్చియుంటి

చచ్చితినె, లేదు బ్రతికిన జాడ గలదు
బ్రతికితినె, లేదు చచ్చిన వార్త గలదు
బ్రతికి చచ్చిన వీర సుభాసు నేను
చచ్చి బ్రతికిన జీవనాశయము నేను-

ఎవరికి చెప్పకుండ భర తేందిర బంధవిమోచనార్థమై
ఆవలికి పోయినాను. అసు రాయుధశక్తి నహింసతో జయిం
చ వశము కాదు కాదని సశస్త్రుడనై భరతోర్వి శత్రు శ
త్రువులను కూడినాను. జయ తోరణముల్ రణమందు కట్టితిన్.

శోకతిమిరము తొలగించు జ్యోతికొరకు
వదలినటు బుద్ధుడు కపిలవస్తు పురము
దాటిపోయితి దాస్య కవాటములను
తిరిగి రానెంచి స్వాతంత్ర్య తరణితోడ.

తమ మాటల్ వినినాడ కాదని- అసత్యమ్మొమొ సత్యాన, ద్వే
షమునో రాగముతోడ గెల్చుట కహింసా శాంతి మార్గాననే
తమవెంటన్ చనినాడ కాదని- మహాత్మా గాంధి నెహ్రూజి స్వాం
తములం దెంతయు కుందియున్ అనరె నేతాజీ భలే యంచు నన్!

పారతంత్ర్య తమస్సు పౌరుష ఖడ్గ ధా
రారుణ ప్రభల చెండాడునట్టి
ఉన్మత్త మత్తమహోగ్ర సామ్రాజ్య వా
దాసుర మకుట మడంచునట్టి
కులమత జాతి సంకుచితత్వ దుర్గాల
చీల్చి మానవుని రక్షించునట్టి
మలయా హిమాలయా వలయాన గ్రుంక బో
నున్న సూర్యుని చెరగొన్న యట్టి

దేశ భక్తోష్ణరక్త ప్రవాస భార
తీయ రణ వీణ అజాదు హింద సేన,
నాటె తొలిసారి ప్రాగ్దిశా వాటిలో త్రి
వర్ణకేతన వల్లి గర్వాల వెల్లి!

స్వాంత్ర్య సమరాన సాగిపోవుట తప్ప
స్వార్థచింతనము, విశ్రాంతి లేని
ఆదర్శసిద్ధికై త్యాగధనము తప్ప
దుష్టార్జిత ధన నిధులవి లేని
జైహిందు జైజై విజయగర్జనలు తప్ప
అంతః కలహ భవు భౌలు లేని

ఆగ్రహ సత్యాగ్రహాస్త్రధారులు తప్ప
పనికి మాలిన పిర్కిపంద లేని

రోజు లవి, జీవితాలె కర్పూరమట్లు
కరిగి, గిరినిభ దాస్య పంకమును కడిగి
వేయు ఆ రోజులు స్మరించు నా యెడంద
పొంగిపోవు హిమాలయ శృంగమట్లు.

స్వాతంత్ర్యోదయ మయ్యె భారత జన స్వప్నాలు పండెన్, అహో
నేతాజీ కనరా డదేమి? తన సం దేశమ్ము విన్పింప డే
లా? తారాపథ చుంబి కీర్తిమయు డే లా? చంద్రుడేలా? జగ
న్మాతృ శ్రీనయ నోత్సవమ్ములకు ఆ నదమ్ము కల్పింపడో?

అని జనవాణి ప్రియమ్మున
నను తలిచి నుతించె, లోకనాకము లొకటై
నను ముంచెను తాదాత్మ్య
మ్మున జీవస్మరణ రహిత మోక్షస్థితిలో

బాపూజీ బలి యయ్యె దుర్మత తమో వ్యాళోగ్రవాహాగ్నికిన్,
ఆపై దీపము ఆరిపోయినటు స ర్దారుఁడు కన్మూ సె, ఇం
కాపై రాలె ననేక తారకలు జ వ్హార్లాలు, శాస్త్రీజి, దు
ష్పాపట్య క్షతగాత్రు లైరి భరత క్ష్మామాత దౌర్భాగ్యమో!

మనుషులు మహాత్ములెందరు మరుగుపడిన
మరుగు పడరాదు స్వాతంత్ర్య తరణి దీప్తి
చితికి పోరాదు ఏ పరిస్థితుల నైన
మీ మనోగత మానవతా మతల్లి.

* * *

# మైత్రీబంధం

నీ మహౌదార్యమ్ము నీ వినమ్రతకు, హ
ర్షించియే నిన్ను ప్రేమించె లక్ష్మి;
నీలోని జిజ్ఞాస నీ రసజ్ఞతను గ్ర
హించియే నిను కటాక్షించె వాణి;
నీ సదాశయ కార్యనిరతులు మెచ్చియే
కోరి పదవులిచ్చినారు ప్రజలు
నీ సుహృద్భావ మైత్రీ సుధాస్నాతులై
పరవశిల్లెదరు నీ ప్రాణ సఖులు;

శారదకును, రమకు యశశ్శారదకును
ప్రేమపాత్రుడవగు నీకు ప్రేమతోడ
నీకు నచ్చిన నా కవితా కుమారి
నిత్తు కొనుమయ్య, కె.యసు. దత్తువర్య!

*(విశాఖపట్నంలో 1964లో నా "రాకెట్టు రాయబారం" కావ్యాంకితం చేసినప్పుడు.)*

* * *

# రసరాట్టు

ఒక మంచి శబ్దమ్మునకె, ఈల పాటకే
పొంగారు నీ అంతరంగమునకు
ఒక రమ్య భావమ్మునకె, రసవాక్కుకే
తీగల సాగు నీ రాగమునకు
ఒక హృద్య పద్యమ్మునకె, వర్ణనమునకే
సంతుష్టి నొందు నీ సహృదయతకు
ఒక భవ్య కావ్యమ్మునకె, నవ్య ఫణితికే
పరవశ మొందు నీ బాలమతికి

నా బ్రతుకు తోటలో వసంతాల లోన
విరియ బూచిన వేవేల సురభిళేద్ధ
శబ్ద, భావ, పద్యముల మంజరుల, కావ్య
సంపదల నిత్తు కృష్ణమాచార్య! కొనుము!

మనసిచ్చి నీ తోడ మాటాడు వారున్న
ఎరుగ వాకలి, దప్పి ఎరుగ వీవు
స్వార్థమ్ములేని నేస్తమ్ముల పొందులో
ఎంచ వాపద, నష్ట మెంచ వీవు
తములమ్ము, ఆటపత్రమ్ములు ఉండెనా
కోటి సంపదలైన కోర వీవు
సరస వినోదమ్ము, శాస్త్ర విజ్ఞానమ్ము
లేనిచో జీవించలేవు నీవు

కలిసి నవ్వుచు నవ్వించ గలవు నీవు
స్నేహమే తప్ప వైరము చేయ వీవు
అట్టి నీ కన్న నా కవితాత్మ పొందు
దిట్ట ఎవ్వరు? నవ రసరాట్టు ఎవరు?

మనము విశాఖపట్టణములో కలిసిన
　　నాడె ఆత్మలు పెంచి పాడినాము
భీముని పట్నపు బీచిపై పసి పిల్ల
　　లట్లు ఆటలు నాడు ఆడినాము
వెన్నెల రేలలో విపిన వీధుల చింత
　　పల్లి కొండల కైత లల్లినాము
పోలీసు పనిమీద పోయి, నేరము వెన్క
　　దాగిన సత్యాలు తరచినాము

వృత్తు లేవైనను మనః ప్రవృత్తు లందు
పథము లవి వేరెయైన దృక్పథము లందు
ఒక్కటే మనము; స్నేహ పయోధిలోన
కలిసి విహరింతమా కలకాల మిత్ర!

మోవిపై చిరునవ్వు మురళీరవము కన్న
　　మోహనమైన దామోదరుడవు
నీలి ముంగురులేను నెమలి పింఛము కన్న
　　మధురోజ్జ్వలమ్మైన మాధవుడవు
చేతిలో మధుపాత్ర శ్రీచక్రమున కన్న
　　చిద్విలాసము చిందు శ్రీధరుడవు
తరుణ భావాలె బృందావనమ్మున కన్న
　　అద్భుతావహమైన అచ్యుతుడవు

పద్మనయనుడ వాజానుబాహుడవు, చ
రాచరానందకర వాక్సుధాకరుడవు
శారదా ప్రసన్నుడవు ఈ స్వాదుఫలము
గైకొనుము కృష్ణమాచార్య! కావ్యరమను.

*10.1970నాడు విశాఖలో శ్రీ పి.వి.జి. కృష్ణమాచార్యులుకు కావ్యాంకితం ...)* ***

# సాహితీ విశ్వనాథుడు

నన్నయనుండి నావరకు, నమ్మినదానిని నమ్మినట్లు, దే
శోన్నతికోసమై నవర సోజ్జ్వల కావ్యము లల్లినట్టి భా
వోన్నతులందు సన్నుతుడ వోయి ! సహస్ర ఫణాగ్రకాంతి సం
ఛన్నుడవోయి! నీ కృతులు సత్యసరిత్తులు విశ్వరాట్కవీ!

చెలియలికట్టపై కడిమి చెట్టును కిన్నరసాని పాటతో
వెలయగ జేసినావు; అది వేదసుబోధ వసంతశోభతో
తెలుగున కల్పవృక్షమయి, దివ్యత రామకథామృతమ్ము ని
స్తులముగ పంచిపెట్టు పరిశుద్ధుల కామనలెల్ల తీర్చుచున్.

వాద నినాద వివాదాంధ్ర సాహిత్య
వనముతో వల్మీకవాణి నీవు
నాటి వ్యాకరణ ఛందస్సూత్ర రణభూమి
ధర్మగీతా ప్రబోధనము నీవు
ప్రాచీన దృష్టి కర్వాచీన దృష్టికి
శిష్టసమీచీన సృష్టి వీవు
నిందయు స్తుతియు వెన్వెంట నీ కీర్తిని
మోసెడి అద్వైతమూర్తి వీవు

దేశకాలాలకును వేషభాషలకును
అంతుపట్టని పరమాత్మకాంతి వీవు
గురువులకె గురుడౌ శిష్యవరుడ వీవు
శిష్యు లెవ్వరు సరిరాని చిద్గురుడవు!

పద్యపు కాలుచేతులను పాశవికమ్ముగ త్రుంచినట్టి, ద్వే
షోద్యమ కర్తలందరు, మహోజ్జ్వల ఛందము విందు సేయు, స
ద్విద్యను తూలనాడి వెలివేసిన దుర్మతులంద రిప్డు, నీ
పద్యసరస్వతీ చరణపద్మములన్ కని మోకరిల్లరే!

నన్నయ్యచేతిలో వెన్న ముద్దలు తిన్న
పద్యమ్ము నీ గుండెపై స్రవించె
తిక్కన్న ఒడిలోన తేనెపలుకులు తిన్న
పద్యమ్ము నిన్నెంతొ ప్రస్తుతించె
శ్రీనాథు నింట పాకానేకములు తిన్న
పద్యమ్ము నీ నోట పరిమళించె
పోతన్న షడ్రసోపేతాన్నములు తిన్న
పద్యమ్ము నిను చూచి పరవశించె

అష్టదిగ్గజములు ప్రసిద్ధాశుకవులు
విందుచేసిన పద్యమ్ము క్రుందినపుడు
జాషువా కృష్ణశాస్త్రి దాశరథి వంటి
సహచరులతోడ పద్యవాసంతలక్ష్మి
ద్రఢిమ నిల్పిన విశ్వనాథుడవు నీవు.

ఏ ప్రక్రియ చేపట్టిన
ఆ ప్రక్రియలోన సిద్ధహస్తుడ వౌటన్
నీ ప్రాభవము ప్రభావము
ధీ ప్రజ్ఞోపజ్ఞ తెలుగుతేజం బయ్యెన్.

దేహాత్మలవలె నీ స
త్సాహిత్యము భాష - భావ సంయోజన, స
మ్మోహకమౌ! అక్షర వీ
ణా హంసక విశ్వనాథ నారాయణమై.

వేయి వాసంతములనుండి వెదకి వెదకి
తెలుగు సాహిత్య శారద తెచ్చుకొన్న
జ్ఞానపీఠ పురస్కార గౌరవమ్ము
నీవు! ఋషివి మానవతామనీషి వీవు.

నీ సాహిత్య సమావలోకనము తండ్రీ! చేయగా బూని, వి
ద్యా సంపన్న రసజ్ఞవిజ్ఞులు, వివేకాత్ముల్ భారతీజ్ఞాన ల
క్ష్మీ సాన్నిధ్యము చేరినారు నవసంభూభావ సందీప్తు లై
భాసిల్లన్ వలె పూర్ణసత్య సమతాభాగ్యోదయ మ్మెల్లెడన్.

* * *

## జాషువా! పీడితజనవాసవా!

కులమత మౌఢ్యమ్ముల పై
కలమెత్తిన మానవత్వ గళమెత్తిన కో
కిల సింహనాదకవితో
జ్వల జాషువభాను మూర్తి! వాగ్రస కీర్తి!

చీకటి గుడులలో చిద్రూపమెత్తిన
గబ్బిలమే నీకు గంటమయ్యె
ఆకలి బడులలో కేకలు పెట్టిన
కడగండ్లు నీ కావ్యకంఠ మయ్యె
నీచమారీచగజనీ గర్వ మడచిన
పిరదౌసి నీశక్తిపీఠ మయ్యె
సంపుటీకృత మైన సత్యసాహిత్య చే
తనము నీ విజయపతాక మయ్యె

షాజహానుని ప్రేమార్ద్ర తాజమహలు.
సర్వసమతాప్రబోధి శ్మశానభూమి.
శిశిర పీడిత దళితుల జీవితములు.
ధన్యమైపోయె నీ భావ దర్శనమున.

ప్రవిమలగుణ సాగరుడవు
నవకవితా పద్య పద్మనాభుడవు ప్రజా
కవిశబ్ద రసాకృతుడవు
శివసుందర సత్యభావ శిల్పివి నీవే!

జనుల జీవనాడులను తంత్రులను చేసి
వినిచినావు రుద్రవీణ వాణి
కపటకలుషనాటకము లాడిన చరిత్ర
బుద్ధి వచ్చి తప్పు దిద్దుకొనియె!

# అవధాన కవితా హంస

తిరుపతి వేంకటేశ్వరుల ధీవిభవ మ్మవధానమందు కొ
ప్పరపుకవీంద్రచంద్రుల ప్రభాప్రతిభావిభవమ్ము, భావనాం
బర రసకేళికానుభవ భర్మము కట్టిన తెన్ను మేడలో
సరసవినోది వాణి దొరసాని వసించును మోహనమ్ముగా!

ధర ఆశుకవితావధానమ్ము కెదురైన
అన్ని సమస్యలన్ అధిగమించి
వర్ణించు మనుచు సవాలు చేసిన కావ్య
వస్తువు లిడిన ప్రశస్తు లంది
దారితెన్నులు లేని దత్తపదాలకు
రూపురేఖల జీవదీప మిచ్చి
న్యస్త నిషిద్ధ ప్రయాసాక్షరములను
చేర్చి మార్చి సుగతి కూర్చి, తీర్చి
మధుర మోహన అవధాన మంత్రశక్తి
జాడలను క్రీడలను చూపినాడ వౌర!
పృచ్ఛకుల ప్రేక్షకుల బుధవిదుల ఎదలు
మేడలౌ నీకు మోహన మేడసాని!

లండను హ్యూస్టను మొదలగు
ఖండాంతరముల అఖండ కవితాశు సుధా
భాండము నిడికొని శుభకర
తాండవమాడిన శతావధానకవీశా!

అభినందింతు శతావధాన కవితా హంసాత్మకా నిన్ను నే
నభినందింతును ధారధారణ సువిద్యావైణికా నిన్ను నే
డభినందింతును, ఆంధ్రవాఙ్మయ వికాసానంద సంధాయక
ప్రభలం దీవును క్రాంతి కాంతి కిరణ ప్రాభాతమైనందుకున్.

*(డా॥ మేడసాని మోహన్ అద్భుత అవధానశక్తికి స్పందించి)*

* * *

# కోటిరత్నాల వీణ

ఆగిపోలేదు రుద్రవీణా స్వనమ్ము
ఆరిపోలేదు నవకవితాగ్ని ధార
ఎగసిపోలేదు నీవు మా ఎదల నుండి
దాశరథి! నీకు అజ్ఞాతవాస మేల!

పుట్టిన దాది, చీకటుల పుట్టలలో బుసకొట్టు నాగులన్
పట్టి విషమ్ము పిండి, నిరుపద్రవ జీవనరుద్రవీణ, చే
పట్టి, ధరాతలమ్మునకుపట్టిన పీడల మట్టు పెట్టగా
పట్టిన దీక్షవీడని ప్రభంజన, మమ్మెటు వీడిపోతివో!

ఎన్నడు జన్మభూమిని సహించగరాని అకించనమ్ము సం
పన్నము చేసి పోవునొకొ! స్వార్థపరత్వ పిశాచకంఠ వి
చ్ఛిన్నము ఎన్నడో యనుచు చింతిలి చింతిలి, నీ ప్రబోధముల్
పిన్నలు పెద్ద లాచరణ పెట్టెడి మార్గము చూడబోతివో!

సర్వసౌఖ్యాల వర్ధిల్లు స్వర్గమట్లు
ఈ జగత్తును రూపించ నెంచి నీవు
అసలు స్వర్గము చూచిరా నరిగినావొ
దివ్యనిపుణులతో సంప్రదింపులేమొ!

"నాతెలంగాణ కోటి రత్నాలవీణ"
అనుటయే కాదు, ఆవీణ అయ్యె నీదు
అక్షరావేశ కవితాంతరిక్ష తంత్రి
అమృత భావాంబ రైక పద్య స్రవంతి!

సుత్తిదెబ్బలు తినుచు ఉసూరు మనెడి - రాళ్లగుండెలపై నీవు వ్రాసినట్టి
కవితలు శిలాక్షరమ్ములే కాక, అయ్యె - నిహత మానవతాత్మ కన్నీటిజాలు

నీ, రుబాయిలు, గజలు నీకంటిపాపలై - నవ్వి, ఏడ్చి, పలచి, నాట్యమాడి
పంచిపెట్టె ప్రజకు పన్నీరు కన్నీరు - మర్మ ధర్మ జ్ఞాన మార్గ మెరిగి!

ప్రేముడిని తెల్గు తల్లిని పిలిచినావు
కోరి నవభరతాంబను కొలిచినావు
దళితజనలోకమాతను తలచినావు
నిస్తుల యశస్సు పీఠిపై నిలిచినావు!

కసితో నిన్ పడద్రోసినట్టి రజనీ కారాగృహమ్మందు నీ
వసి ధరానిశితారుణాక్షర లిపిన్ ఆసేతు శీతాచలో
ర్వి సుఖానంద మరంద గీతికల ఆవేశించి వ్రాయుచు ప్రభా
ప్రసవమ్ముల్ విరబూచె ఘోరపరతంత్రధ్వాంతముల్ వీడగన్!

సత్య సుందర శబ్ద శస్త్రాలు సంధించి
తిమిరాసురుల కడతేర్చినావు
త్యాగ రంజిత 'కవితా పుష్పకమ్ము' పై
వెలుగు లెల్లెడ చేరవేసినావు
ఆలోచనాలోచనాలోకనముతోడ
కళ్యాణదుర్గాలు కట్టినావు
ఒక మహాబోధివై ఒక శాంతి దూతవై
మనిషిని మనిషిగా మలచినావు

పద్యమైనను గేయము గద్యమైన
జీవకళ యయ్యె నీభావచేతనమున
వాద మేదైన నీ సిద్ధవాక్కుముందు
మోకరిల్లెను సత్యసమ్మోహనమున!

నందనవాటికల్, వితరణస్థిత కల్పక కామధేనువుల్
సుందరమైన అప్సరలు శోభలు, సర్వసమత్వ జీవితా
నందములున్, సుధల్ ప్రణవనాదము నిత్యము వెల్గుగాక, ఈ
కుందెడి భారతావనిని కూడను దాశరథీ! భవత్కృపన్!

(మహాకవి దాశరథి సంస్మరణ)

* * *

జె. బాపురె

# హిమగిరీంద్రుడు రవీంద్రుడు

హిమగిరీంద్ర శిఖరి, హిందూ మహాంబుధి
గంగ, యమున, కృష్ణ కలవు మాకు
కలవు తూర్పు పడమరల కనుమలు మాకు
కవి రవీంద్ర! నీవు కలవు మాకు.

కలవు కాని నేడు కనరావు కనులకు
ఐన లేదు నీవు లేని చోటు
లోని కనులు విప్ప లోకమ్ము నిండార
కలపు నీవు, వెల్గ గలపు నీవు!

వంగమె కాదు, ఈ భరత వర్షమె కాదు, ప్రపంచ మెల్ల ఉ
ప్పొంగెను నీయెడంద విరబూచిన కావ్యకళా పరీమళో
త్తుంగ తరంగ డోలికల; దుర్భర దాస్య విశీర్ణ సాహితీ
ప్రాంగణమందు నాటితి వయా విలసద్రసపారిజాతముల్!

శీతాద్రివై నీవు గీతాంజలి ఘటించి
ప్రకృతిలో లీనమై పాడు నపుడు.
విశ్వ భారతి వీణ వినిపించె నొక క్రొత్త
శ్రుతి, నవజీవన యతి; రవీంద్ర!
దేశాల విడదీయు ద్వేషాగ్ని కుడ్యాలు
కూలె, ప్రాక్పశ్చిమాల్ కూడి పాడె
దివ్యగంగ భూగంగతో కూడి ప్రవహించె
నరునిలో దివ్యగంధములు వీచె

ప్రావృడంభోధర రథమ్ముపై నొకపుడు
పుష్ప సురభిళ వన మార్గమున నొకపుడు
స్వామి యేతెంచు, నీ పాట ప్రేమ హస్త
మునుచ, ఆనందజలధిలో ముంచె నిన్ను.

మంజుల భారతిన్ హృదయ మందిరముందున నిల్పి, దేవ భా
షం జెలువొందు నా ఉపనిష న్నవసారము పిండి, నీవు గీ
తాంజలి పట్టి నవ్య హృదయాంజలి పట్టి జగజ్జనాళి భ
క్తిం జపియింపరే భరతదేశ యశోరవి నిన్ లసత్కవీ!

సృష్టించితివి కవిస్రష్ట! 'గోరా'ను నీ
దేశభక్తికి దివ్యదీప మట్లు;
ఒక అల్పఘటన మొక్కొక చరిత్రకు బీజ
మిడు నని తెలుపు నీ 'పడవ మునక';

నీలోని స్వేచ్ఛా దయా లక్ష్మి ఉప్పొంగి
పారెను నీ 'ముక్తధార' లోన,
నాట్యాభినయ కళౌన్నత్యంబు చాటింప
గల్గె నీ "నర్తనకన్య పూజ";

అమృత హృదయ! నీకథలు సత్యములు చాటె
నీ పవిత్రగానమ్ము వెన్నెలలు గాచె
శ్రీ రవీంద్ర కవీంద్ర! నీ సిద్ధ వాగ్ధ
నిత సరస్వతి విశ్వజనీన మయ్యె!

మంచుకొండను జూచి, మానసమ్మును పెంచి
అమృతధారగ పారినట్టి నీకు
ఎండకాలపు గుండె ఏ మేమి వాపోవు
చుండెనో వినిపించుచుండు నీకు
మెరపు ఖడ్గము లాగి చిరకాల దాస్య శృం
ఖలములు తెగవేయ గల్గు నీకు
బ్రతుకునేలను పండు లాభ ప్రమాదాలు
అనుభవించుచు ఋషి యైన నీకు

మన్ను దున్నెడి మనుజుల మధ్య ఎపుడు
దేవు డుంట గాంచిన గురుదేవ! నీకు
గురు వొకండు, బడి యొకండు ధరణి లేవు
ధాత్రు విరచిత ప్రకృతి పుస్తకము తప్ప!

నీజన గణ మన గానము
నీజాతికి గీత మయ్యె, నీ స్వప్నము స
ద్యోజాత సత్య మయ్యెను
మా జీవిత వేదనాదమా! కోకిలమా!

ఖండాంతరముల భారత
ఖండమున కఖండ కీర్తి గడియింప కవీ
ట్కాండమ్మున నీవె కవీం
ద్రుండ వనిరి లోకకవివరుల్ సత్యాత్మన్!

నీ గభీరానంత సుందరతా గవేషణమున సుమించెను
ఆ యపూర్వామ్లాన తారుణ్యా మృ తోషా బాల ఊర్వశి!
నీదృఢోజ్జ్వల మానవత్వారాధనమ్మున నిల్చె "శాంతి ని
కేత" నమ్మున విశ్వ భారతి భూతలము వెల్గన్!

సరస సాహిత్య సంస్కృతి స్నపిత మైన
ఆంధ్రజాతి నిన్ గుండెల కద్దు కొనుచు,
నీ కళామందిరములను నిల్పుకొనును
అభ్యుదయ శాంతి శిఖర సమగ్రములను!

* * *

# మొల్ల కవితాశక్తి

మొల్లను గూర్చి నే కనులు మోడ్చి స్మరించితి; కానుపించె ఓ
హల్లకపాణి, రమ్యరజితాక్షరవేణి, ప్రబుద్ధవాణి, తా
నల్లుచునుండె భక్తిరస మౌక్తిక హారము; కాదు జానకీ
వల్లభు పుణ్యగాథ, ప్రణవ ప్రణయాత్మకథా ప్రబంధమున్.

పుబ్బనక్షత్రాన పుట్టిన మొల్లమ్మ
        తల్లిని కోల్పోయి తల్లడిల్లె
తల్లియు తండ్రియు తానెయై కేసన
        సెట్టి ఆపట్టిని చేసె పెంపు
శ్రీకంఠమల్లేశు సేవలో కైంకర్య
        బద్ధయై బసవియై సిద్ధిపొందె
అలకృష్ణరాయల అష్టదిగ్గజముల
        అభిమాన కవయిత్రి యయ్యె నామె

హర హర వరప్రసాదమహత్తు కలన
ఇహ పరానంద సత్య సాహిత్య సృష్టి
సలిపె నవరస భరిత దాశరథి చరిత
మొల్ల రామాయణముగ వర్ధిల్లె జగతి.

"శ్రీమహిమాభిరాముడు, వసిష్ఠ మహాముని పూజితుండు, సు
త్రామవధూ కళాభరణరక్షకు డాశ్రితపోషకుండు శ్రీ
రాముడు" మొల్లమాంబకు వరంబిడి 'ఏమని ఆనతిచ్చెనో
ఆమె రచించె జీవితరహస్య నృతానుభవేతిహాసమున్.

గంటము బూని ఆదికవి కావ్య రుచిన్ మదిలోన నింపి, ము
క్కంటి శిరత్ సరత్ ధిషణ గంగను ధారబోసి మేటి తె
న్గింటి శుభాంగి, జ్ఞాన పరమేశ్వరి మొల్ల రచించె ధారుణీ
కంటక రాక్షసత్వ దశకంఠ విలుంఠన రామగాథలన్!

ఇల రామాయణ మెందరో మగకవుల్ హృద్యంపు పద్యాలలో
పలురీతుల్ పలుదేశభాషలను సంభావించి చిత్రించినన్
లలనాదృక్పథ మందు లేదనుచు అల్లల్లాడె శ్రీవాణి, కాం
తల హృద్వేదిని మొల్ల వ్రాసినది సీతా వల్లభాఖ్యానమున్!

మగవారికన్న మగువలు
సుగుణమ్ములలోన రూపశోభలయందున్
తగు వా రను సత్యమ్మును
తెగచాటిన వీరనారి ధీమణి మొల్లే!

మగువను మందర చేసిన
మగవారికి బుద్ధి చెప్ప మందరపాత్రే
అగుపించని రామాయణ
నిగమము సృష్టించె మొల్ల నిర్మలదృష్టిన్!

పతులు వంచించగా ఉపపతుల కూడి
పతిత లౌచున్న సతుల దుస్థితుల తేట
తెల్ల మొనరించినట్టి ఆమొల్ల ఎరుగు
ధర్మ మేదియొ భువి పాపకర్మ మేదొ!

ఏనాడో తన కిత్తు నన్న వరముల్ ఇమ్మంచు కైకేయి కో
రెన్ నాథున్; రఘురామచంద్రుపయి వేరే భావమో వైరమో
కానే కాదని విశ్వసించి చిర సంస్కార ప్రబోధాత్మక
స్త్రీ నైజమ్మును చాటు మొల్లకవయిత్రిన్ ధాత్రి కీర్తించెదన్!

అలతి అలతి మాటలతో
సలలిత భావాలు శైలి సారళ్యముతో
మలచిన రామాయణమున
కలకాలము నిలుచు దివ్యకాంతులు నిండెన్

కులమత లింగ విభేదము లెంచని కోకిల గానము తానై
కలుష సమాజ కిరాతక పీడిత క్రౌంచ విహంగము తానై
విలవిలలాడిన ధర్మ శతాంగపు విజయ పతాకము తానై
వెలసెను మొల్లమ రామకథాగత విప్లవభావము తానై!

శ్రీకార ఓంకార శిఖరాగ్రవాసిని
    అక్షరానంద లాస్యాబ్జచరణ
శ్రీరామ శివనామ పారాయణ తపస్వి
    సాహిత్య సంగీత సారసాక్షి
ఊరేది యైనను పేరేది యైనను
    తీరాలు లేని సుధీవిశాల
దివికి చేరిన తల్లి భువిని వెలిగిన తండ్రి
    దీవనల్ బడసిన పావన ధుని

మొల్ల నవరసభావ సంపుల్ల వదన
మాటలాడిన ముద్దులమూట లయ్యె
పాట లల్లిన నెత్తావి తోటలయ్యె
పద్యధారలు ప్రగతికి బాటలయ్యె!

* * *

# దువ్వూరిద్యుమణి

స్వాభిమానము; ఆత్మవిశ్వాసదీప్తి
సూర్యచంద్రులు నీదు యశోవిశాల
సాహితీలోకమునకు; రసానుభూతి
వాహినులు అయ్యె నీనవ్యభావవృష్టి!

నెల్లూరు మండలమ్మున
పల్లియ చిరునవ్వులోన ప్రభవించియు సం
ఫుల్లాత్మ చేతనత వ
ర్ధిల్లిన దువ్వూరి రామిరెడ్డి కవీంద్రా!

విలవిలలాడిన విలువలు రక్షింప
ప్రజ్ఞాన గిరులెత్తి పట్టినావు
సత్యబంధవిముక్తి సల్ప చీకటిమీద
కావ్యాల వారధి కట్టినావు
అసురత్వ ఘాతధర్మాగమ ప్రహ్లాదు
విజయగర్జకు శ్రుతి వెట్టినావు
సుఖదుఃఖ చక్ర సంక్షుభిత జీవాత్మకు
నిజబోధిసత్వము నేర్పినావు

ప్రకృతి లోలోని మానవ ప్రకృతిలోని
తత్వములసారమే నీ సుధామయోక్తి
పూర్ణవిజ్ఞాన కవితా ప్రబోధ మయ్యె
ఖండకావ్య కథాకావ్య భాండమయ్యె.

ఏబది రెండు వత్సరములే భువిలోన వసించి జీవితా
హోబిల మూర్మికాక్షర రహోరసతత్వ మెరింగినావు, మే
ధాబలశాలివై పరమదార్శని కాభ్యుదయాను భూత్యుప
జ్ఞా బుధశాలి కోకిలమువై ఋషివై అభిరామిరెడ్డివై!

అన్నా! నీకవితా కళా హృదయ భావావేశమున్ చూపగా
ఎన్నో భాషలు నేర్చినావు నవ సాహిత్య ప్రపంచంబులో,
కన్నీటిన్ భరియించి నీ తెలుగు మాగాణాల విజ్ఞాన సం
పన్నంబైన అపూర్వ కావ్య నిధులన్ పండించినావో కవీ!

కవితలు చూచి మాన్య కవి కాంతము గుండెల కద్దుకోగ నీ
నవరస పూర్ణ చిత్ర రచనన్ గని పొంగె కళామతల్లియున్
అవిరళ సాహితీ కృషికి అంకితమైన త్వదీయ జీవితా
ర్ణవమున తేలియాడె రసరాణి భవాని వివేక వాణియున్.

ఒక్క మధు పాత్ర చేబూని చక్కనైన
చుక్క సాఖీని కనులార చూచుకొనుచు
ఉమరఖయ్యాము పాడిన అమరగీతి
మానవునికి జీవనతత్వ "పానశాల".

వన్నెచిన్నెల పారసీ వనములందు
కైపుతో పాడు ఖయ్యాము కైతలకును
తేనె లొలికెడు నీతేట తెనుగు త్రాపి
చోద్యముగ పదపదమ్మున చూపినావు
కొత్త కొత్త గమత్తుల మత్తులెన్నొ!

వాదవివాద దూరగుణ వర్ధకమౌ ప్రతిభామృతమ్ములో
వేదములయ్యె మూలమును వీడని నీ అనువాదముల్, రసా
స్వాదనలోను తాత్విక విచారణ లోను అనన్య సాధ్యమౌ
నీదగు "పానశాల" కృతి నీకు; ఖయామునకు నిండు కీర్తియౌ.

* * *

# సుగుణాల సుబ్బిరెడ్డి

నత్తరామేశ్వర నారకేళవనాల
రైతు బిడ్డడుకట్టె రాజమహలు
లండను పెనుమట్ర మండలమ్ముల మధ్య
త్యాగశీలత స్నేహ ధారవోసె
పెద్దపెద్దబడుల విద్దెలు నేర్వని
బాలుడే కట్టె విద్యాలయాలు
భారతీయుల దేశభక్తికి శక్తికి
తెలుగువా డాదర్శతీర్థ మయ్యె

తాను పుట్టిన మట్టి నౌదల ధరించి
కష్టనష్టాల కలి పరీక్షల భరించి
అతుల రామేశ్వరుని ప్రజాహిత సుమాల
రేయిపవలు కొల్చెడి సుబ్బిరెడ్డి అతడు.

బాల్యమ్ములో తోటిబాలురకు మిత్రుడై
ఆటలేతప్ప కొట్లాడలేదు
యౌవనోదయమున ఆదర్శమూర్తియై
ఇచ్చుటే తప్ప అర్థించలేదు
రామేశ్వరము వీడి రంగూను వెళ్ళినా
తన ఇంటి మర్యాద తప్పలేదు
రంగూనునుండి ఇంగ్లాండుకు చేరినా
మన జాతి సంస్కృతి మరువలేదు

ఒక్కడే కాదు ఎదవిప్పి లెక్కలేని
పేద బిక్కుల తనవెంట బెట్టుకొనుచు

కలిమి సీమకు చేర్చిన కర్మయోగి
సృజనతో కష్టముల జయించిన ప్రయోగి
చెలిమితో బలిమిని సహించిన విరాగి!

అచ్చతెలుగుబిడ్డ అచ్చమాంబను పెళ్లి
యాడిన భారతీయాత్మ డతడు
తొలిచూలిని ఎడద తొట్టిలో ఊపుచు
"వెంకన్న" యనిన సాత్త్వికుం డతండు
మలిచూలి తన ఇంట వెలియుగానే "రామ
కృష్ణ"యటన్న సత్కీర్తి పరుడు
పాప లిద్దరిని సంభావించె లీలావ
తీయంచు నాగేశ్వరీ యటంచు

ఎచట ఉన్నను భాగ్యా లవెన్ని వున్న
కన్నతల్లిని కీర్తించు కావ్య మతడు
ఎపుడు చిత్తాన నత్త రామేశ్వరుండు
వెలుగుచుండెడి కొత్త కోవెల యతండు.

ప్రెస్టనులో కాలుపెట్టినప్పటినుండి
సుబ్బిరె డ్డావూరి చుట్టమయ్యె!
ఆంధ్ర సంఘమున సభ్యత్వ మొందిననాడె
యూ.కే.కు సజ్జనయోగ మబ్బె
చిన్న వ్యాపారము చేపట్టినప్పుడే
పెద్దపెద్దలమెప్పు పేరుపొందె
ఇండియాయే తన గుండె యని తెలుగు
ప్రజలపాలిటి త్యాగరాజు అయ్యె

కానుపడు నాత డొక్క అక్షరమువోలె
కాని శివసత్యసుందరాకారు డతడు
ఊరుపేరొకటైన శ్రీకార మతడు
భారతికి ఇష్టమైనట్టి భాష యతడు.

ఆశయముల లోన ఆలోచనలలోన
స్వార్థపరత లేని పరుల మేలె
దీపమట్లు వెలుగు త్రికరణ శుద్ధులు
అబ్బినట్టి బ్రతుకు సుబ్బిరెడ్డి.

నా కమనీయ భావరస నందనవాటిక "పంచబాణసం
చా" కృతి అంకిత మ్మిడితి చంద్రునికిన్ ఒక నూలుపోగునా
లౌకిక మైన స్నేహము ల లౌకికమై అలరించె మమ్ము, ఇ
ట్లే కొనసాగవుత! సుహృచ్ఛ్రయ బంధము జన్మ జన్మకున్

అభినందింతును ఆతని
శుభ సంకల్పముల విజయశోభకు గానన్
అభిలాషిస్తా నాతని
కభయత మృత్యుంజయత్వ మబ్బాలనియున్.

* * *

# బమ్మెర కోకిల

బమ్మెర కొమ్మపై తెలుగు భాగవతామృత కోకిలమ్మువై
చిమ్మిన భక్తి భావరుతి శీకర శ్రీకర హృద్య పద్య రా
గమ్ములు కూర్చె పంచశతి కాలము తాళమువేయ ఆంధ్ర దే
శమ్మున కాంధ్ర సాహితికి శాశ్వత హేమ వసంత శోభలన్.

పలికినది భాగవత మని
పలికిన పలికితివి గాని పలికిన దెల్లన్
పలికినది మానవతమై
పలికిరి ముగురమ్మ లొక్క పలుకై నీవై.

సత్యాన్వేషణ నిత్య కృత్యముగ హింసా కంస విధ్వంసనున్
దైత్యారిన్ హరి నచ్యుతున్ గొలుచు దే దర్శమ్ముగా నెంచి, సా
హిత్య క్షీర సముద్రమున్ తరచి సాహిత్యామృతం బిచ్చె స్వా
ర్థత్యాగ ప్రణవ ప్రబోధనధన ప్రఖ్యాతి వైతాళికా!

తత్వ మసి కన్న మించిన
తత్వము వేరొకటి లేదు తత్వ జగస్త్రై
తృత్వము నీ సుకవిత్వ ర
సత్వము నెలకొల్పె పరవశత్వము తోడన్.

ఒక బక్క రైతువై ఒక మహారాజునే
ధిక్కరించిన కళాధిపుడ వీవు
అందరి నోదార్చు అక్షర వాణినే
ఓదార్చినట్టి భావుకుడ వీవు
హలమైన కలమైన అఖిల జనానంద
సాధనమే నన్న సమత వీవు

భోగినీ భోగ ప్రబోధాత్మలో నుండి
త్యాగివై మ్రోగిన యోగి వీవు
దారసుతులను సహజ సంసార పథము
బంధు మిత్రులు సాంఘిక బాధ్యతలను
వీడకయె మానవత్వము వీడకుండ
మనిషి దేవుడు ఒకడైన మహిమ వీవు.

కావ్యకన్యల కూళల కమ్మ రాద
టన్న నీవాక్కు లోక కళ్యాణ ముక్కు
కూటికోసము అమ్మరా దోటు హక్కు
అను ప్రజాస్వామ్య సందేశ మయ్యె నేడు.

చలివేంద్రమ్ము కళాత్మ తృష్ణకు సహస్రస్తంభ రామప్ప శై
వల సంప్రోజ్వల శిల్ప కల్పనము; జీవజ్జీవ దేహాత్మనై
ర్మల కేంద్రమ్ము త్వదీయ భావసుషమా రామమ్ము; తత్కాకతీ
యుల సామ్రాజ్యరమా విభూతికిని నీ ఉద్వాణికిన్ మ్రొక్కెదన్.

*(1982 ఓరుగల్లులో జరిగిన పోతన పంచశతి ఉత్సవాలలో...)*

* * *

# విజయేందిర

ఇందిర వీవు, భారత జనేందిర వీవు, స్వతంత్రభావ గీ
తీందిర వీవు, దీన బలహీన జగజ్జనతా వికాస చై
త్రేందిర వీవు, శాంతి సమరేందిర వీవు, పవిత్ర సామ్యవా
దేందిర బాంగ్లదేశ విజయేందిర వీవు, జయస్వరూపిణీ!

కాంతియె తప్ప నల్దిశల క్రాంతియె తప్ప పరాజయమ్ము గో
రంతయులేని దిగ్విజయ యాత్రలలో వెలిగించినావు సం
క్రాంతిని, భారతీయ చింకాల చరిత్ర పుటమ్ములందు కొం
డంతల చీకటుల్ తొలగునట్లు యశోద్యుతి పంచునట్లుగా!

నింగియు నేల సంద్రములు నేడు గడంగడలాడిపోయె, త
త్సంగర భూము లన్నిటను శత్రువు చిత్తుగ ఓడిపోయె, ఉ
త్తుంగ హిమాద్రిశృంగ మటు తోచెను భారతజాతిశక్తి, నీ
మంగళమూర్తియే భరత మాతృ జయోర్జిత వజ్రమూర్తి పో!

అసురుల కొందర హతమార్చె రాముడు
సురత్వమే నీవు అణిచినావు
దుష్టుల కొందరిన్ దునిమిరి పాండవుల్
దుష్టత్వమే నీవు దునిమినావు
నరహంతయౌ ఒక్క నరకు ద్రుంచెను సత్య
నరకత్వమే నీవు నరికినావు
మహిషు నొక్కని గూల్చె మహలక్ష్మియౌ దుర్గ
మహిషత్వమే నీవు మాడ్చినావు

వ్యక్తివా కాదు, నవసంఘశక్తి వీవు - మనిషివే కాదు, ఉజ్జ్వల మానవతవు
ఇంటిలోపలనే కాదు, మింటిలోన - దీప మీవు మా ఆశల రూప మీవు!

*(1971 డిశెంబరు యుద్ధంలో భారతదేశపు విజయరూపిణియైన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధికి అభినందనగా...)*

* * *

# ఎఱ్ఱయ

ఆరణ్యములో చిక్కిన
భారత ఖండమును తెలుగు భారతి మెచ్చన్
ధీరోద్ధతి కాపాడిన
వీరా! ఎఱ్ఱయ్య నీకు ప్రేమాంజలిదే!

హరివంశయశము పోతెనె
స్థిరమై నీ కీర్తి హృదయసీమలలోనన్
విరబూచి వెలుగుచుండును
హరినర భేదమ్ములేని అద్వైతముగా.

ఒంగోలు మండలము ఉ
ప్పొంగెను ఆ పదలువాద పొలిమేరలలో
పొంగెను నీ అద్భుత రస
గంగలతో ఆత్మయోగ కళ్యాణముతో.

*(9.6.1985నాడు ఒంగోలులో జరిగిన ఎఱ్ఱయ ఉత్సవాలలో ఝటితిస్ఫూర్తిగా చెప్పిన పద్యాలు)*

* * *

# శ్రీనాథపీఠం

సీసాలలో కవితాసవమ్ములు నింపి
అందించితివి రసానందములుగ
శృంగారమును మేలి బంగారముగ మార్చి
పంచి పెట్టితివి నిష్పాక్షికముగ
ప్రతిభతో పాండిత్యపటిమతో గెలుచుకొ
న్నావు అక్షరభావనా వనులను
కలకంఠమై కాల కంఠుడవై మోసి
నావు ఓంకార శంఖారమ్ము

నాడు శ్రీనాథ! ఈ తెల్గునాడు లోన
శ్రీ సరస్వతి మంగళా వాస యోగ్య
మయ్యె మానేల నీ కవితార్చనమున
రమ్ము ని జాతి ప్రగతి పీఠమ్ముపైకి.

*(1985లో గుంటూరు సభలో)*

* * *

# కళా కృష్ణ

నటరాజ గిరిజాభినయ కళా కైలాస
శృంగ స్రవన్నాట్య గంగ యతడు
కూచిపూడి కళామకుట నందనారామ
చక చకత్ శ్రీపారిజాత మతడు
కృష్ణలీలానంద కేళీవనాంతర
కుసుమిత మల్లికాకుంజ మతడు
తెలుగు శారద గళోద్దీప్తరాగములోన
పరవశించెడి భావపద మతండు

శ్రోతలందరు ప్రేతలై చూచుచుండ
వేణుగాన విలోలుని, ప్రేమధనుని
తన వశము చేసుకున్న సత్యస్వరూపి
క్రీడన కలాపనా 'కళా కృష్ణు' డతడు

*(1985లో ప్రఖ్యాత కూచిపూడి నృత్య కళాకారుడు శ్రీ కళా కృష్ణ భామాకలాపం చూసినప్పటి స్పందన).*

* * *

# సృజన కీర్తికి షష్టిపూర్తి

"సాయి సుధార్చిత శ్రీ రా
మాయణపారాయణమున మత్తిల్లిన జీ
వీ యస్ కోకిల పాడెను
వేయి వసంతాల తెలుగు వినని పరమ్ముల్"

అని మదిలోన, నాలుగు దశాబ్దము లాంధ్ర సరస్వతీ సమ
ర్చనమున శబ్దవేదియయి జ్ఞాన చతుర్ముఖ సృష్టిపొంది, పా
వన పరిశుద్ధ లోక హిత వాఙ్మయ సృష్టి యొనర్చినట్టి నీ
ఘనతర సాహితీ తపము కన్నుల కట్టగ పొంగిపోయితిన్

జీవీయస్ అనగానే
జీవీ సుబ్రహ్మణ్యము జీన్యస్ అని వి
ద్యావేత్తలందరును సం
భావించి ప్రశంసలిడుట బహుధా కంటిన్

నీ వొక భూరి భూరుహము నేలను వీడక మట్టిలోన నీ
జీవన మూల ధాతువుల చేపకు వేరము వేసి నల్దెసల్
నీ వరభావ శాఖలు, వినీల విహాయసమంట సాగగా
వేవిధ సత్యసుందర వివేక కృతుల్ విరబూసె వాఙ్మ

ఎన్నో వాదము లెన్నొ వర్గములు ఎన్నెన్నో వివాదమ్ము లిం
కెన్నెన్నో విపరీత ధోరణులు సాహిత్యోద్యమాల్ వచ్చి పో
తున్నన్ వీచికలట్లు, నీవు సమదృక్ ద్యోతసత్యత్వమ్ముతో
చెన్నారన్ గుణదోష పార్శ్వముల విశ్లేషించినా వప్పుడున్

ప్రక్రియలన్నిటిలోన ప
రా క్రమమును చూపినావు రాజితరచనా
చక్రము త్రిప్పుచు, అందున్
చక్రివె నూతన విమర్శ సమరము లోనన్

ఎప్పుడు చూతువో జగతి నెల్లెడ వెల్వడు క్రొత్త రీతులన్
ఎప్పుడు వ్రాతువో విబుధు లెల్లరు మెచ్చె డనేక గ్రంథముల్
త్రిప్పువు నీ స్వతంత్ర పథ దృష్టిని సృష్టి రహస్సునుండి, నీ
వెప్పుడు ఉద్గమించి రవివేయని 〃పింతు వనంత కాంతితో

కవివరులైనను కథకు లైనను వ్యాస
కర్త లైనను భాష్యకారులైన
నవలారచయితలు నాటకకర్తలు
పరిశోధకులు సభావక్తలైన
నవ్య భవ్య విమర్శనా రంగమున కృషి
సల్పు ఎంతటి బుద్ధిశాలు రైన
లలిత కళా క్షేత్ర లబ్ధ ప్రతిష్ఠులు
ఆచార్యులైన విద్యార్థులైన

వారి రచనలు కృతులు ఏ పాటివైన
"జీనియస్ చూచి ఒప్పాలు చెప్పినపుడే
ఆత్మ సంతృప్తి పరదుడు రఖి లాంధ్రమందు
చాలు ఈ మాట నీ కీర్తి చాటిచెప్ప.

నీ వెంట నడచి నిస్చింతచేసిననది మా
చెల్లి నీ పత్ని సుశీలయేను
నీ కంటి పాపలై నీ 'కలం' నడిపెడి
శ్రీ వాణి లక్ష్మి పుత్రికలు నీకు
నీ సదాశయములు నెరవేర్చు చున్నారు
సుతు లిద్దరును వారి సతులతోడ
నీ శక్తి గుర్తించి నీకు తోడ్పడెదరు
త్యాగధనులు ధర్మదాత పరులు

నీ నిరంతర సాహితీ నిష్ఠ కెపుడు
అండదండలు నీ పాఠకాళియేను
ప్రాజ్ఞులు రసజ్ఞులైన జిజ్ఞాసువులకు
జ్ఞాన వీణాత్మశ్రుతులు నీ అమృత కృతులు

నీకును నా కిలలో చిర కాలవినిర్మల మైత్రి లభించెనహో
ఆకసమైనను హద్దగునా మన అక్షర లక్షిత ప్రేమ పతకమ
లోకము నాకము నేకము చేయు వి లోకన సత్యము చాటుటయే
"మా కల కాల సదాశమంచు" ప్రమాణముచేసి తరించెదమా!
అరవదేళ్ళ నిన్ను అలరించినందుకు
కాలచక్రమునకు పూల కాన్క
షష్టిపూర్తి పేర శారద కిచ్చేవి
పూలు కాదు పుస్తకాల మాల

అరువది వాఙ్మయులను ఈ
పరువములో సత్కరించి పరమార్థము శ్రే
కరమగు "షష్టి"కి కూర్చిన
నిరుపమ వాగ్దేవి పూజ నీకిదు శుభములి

*(1996లో పుంభావ సరస్వతి ఆచార్య జీ.వి. సుబ్రహ్మణ్యంగారి షష్టిపూర్తి సందర్భంలో ఆత్మీయ అభినందన గంధం)*

❋ ❋ ❋

# రసికోదయం

అది పరదేశ: ముందు భరతావని సంస్కృతిలోని జ్ఞాన సం
పదయుతు లౌచు. అద్యతన భాషలు విద్యలు నేర్చి, శాస్త్రసం
విదిత వధూవరుల నిగమ వేదిత దంపతులై స్వధర్మకో
విదు లయి వచ్చి పశ్చిమ నవీన సమాజములో వసింపగా!

అల్లారు ముద్దుగా. పసి
పిల్లలవలె మెలగుచుండ ప్రియసఖ్యముతో
ఎల్లరికి ఆప్తులై, వ
ర్థిల్లిరి సుషమాత్మరూపురేఖలతోడన్.

ఉన్నత విద్యలు ఉద్యోగ-ధర్మాలు
వదలని పుణ్యదంపతులు వారు
ఒకరి నొక్కరు "ఓయి ఓయంచు" పిలుచుచు
పరిహాసమాడుతుంటరులు వారు
నాదె అందమ్మంటె నాదె అందమ్మని
వగలు చూపెడి జానపదులు వారు
కొట్టుకైనా తతకొలనుకైనా సరే
ఐతమూడి వావు స్నేహితులు వారు

ఇండియాకైన, మిత్రుల ఇంటికైన - ఒంటిగా పోని వలపులజంట వారు
కలలు కన్నను వాస్తవికతలు గన్న - కలిసియే కను అద్వైతకములు వారు!
ఎవరిపేరేదియైన ఆ సమిధునము
రాధికా కృష్ణుల ట్లహోరాత్రులందు
ఇన్ను మిన్నులు మెచ్చ ప్రేమించు కొనుచు
గడిపినారు మూడే ళ్లొక్క క్షణమువోలె!

భారతదేశంలో గల
వారల తలిదండ్రుల శుభవచనము లందెన్
దారకు, తన సద్గుణ పతి
కోరిన రీతిగనె గర్భకోశము పండెన్.

నిదురించెడి కాయములో
నిదురించని ఆత్మ గోస్తనీనవరసనా
రదమున తేలుతు వచ్చిన
ఉదయ మ్మటు శిశు వొకండు ఉదయించెనహో!

పుట్టిపుట్టగనే పేరు పెట్టమనెను
దేశ శాసన పరిపాలనా శుభాంగి
పెట్టకయె పెట్టి నా రొక పేరు తలచి
"రసికు" డని - వీడు సద్గుణరాశి యంచు.

అమ్మను, నాన్నను, తన అ
మ్మమ్మను,, నానమ్మను ప్రియమగు తాతల. చి
త్రమ్ముగ చూచుచు కడు చో
ద్యమ్ముగ తనపేరు ఇష్టమైనటు నవ్వెన్!

అతని పోలికలను అంచనావేతురు
అమ్మలక్క లతని ఆవరించి
ముక్కు మొగము చూచి ముచ్చట పడిపోయి
ముద్దులిచ్చుటకని మురియు తల్లి

తల్లికళ్లని, చెక్కిళ్లు తండ్రి వనుచు
ముక్కు తాతది, నానమ్మ మోవి యనుచు
కాదు అమ్మమ్మదే ముఖకాంతి యనుచు
మామ పోలిక ఈ చందమామ య్యనుచు
వాదులాడెద రా పసివాని గనుచు!

జోలలు పాడనిదే ఆ
బాలుడు నిదురించడాయె: పాలిచ్చుటలో
ఆలస్యమైన, ఏ మా
టాలించడు బ్రహ్మదేవు డత డైనట్లే!

తొట్టిలో ఆడుకొనెడి ఆ పట్టిచుట్టు
తిరుగుచును కేకలిడుచు సంతృప్తి పడుచు
బంధు మిత్రుల పిల్ల లాబాబు, పసిడి
బొమ్మయనుకొని ఎత్తుకోబోదు రతని!

ఇన్నాళ్లు నీ వెక్క డున్నావురా! తండ్రి!
అని తన్మయత చిట్టి నడుగు భర్త
తండ్రి ఎవ్వరో నీకు తనయుడు ఎవ్వరో
కాంచలే వని వెక్కిరించు భార్య
"పట్టి ఏడ్చును పాలు పట్టవోయీ" అని
అలిగి పిలుచు రాగాల మొగుడు
ఓయి ఎవ్వరో నీకు ఓసి ఎవ్వరో, తెల్ప
దోయంచు త్రిప్పు కందోయి భార్య

మాయమాట లెఱుంగని మౌనభాష
నవ్వుపెట్టక సరసాలు ఆడుకొనెడి
ఆలుమగలను గమనించు ఆత్మబంధు
లందరికి వారి సరదాలు విందుసేయు.

నాపోలికయే యను సతి
నా పోలిక యని పతి అనునయమున వారల్ ముద్దిడుచున్
ఏ పోలిక ఎవ్వరిదో
ఆపాప వెరింగినట్లు, ఆడుచునుండెన్.

దివ్యతేజోమయ సువర్ణదేహు డితడు
బాలు డైనను ఆజానుబాహు డితడు
"నాకు తోచిన మాట చెప్పనా" యనుచు
తత్వముల బాట తెలుగు తాతయ్య చెప్పె!

అనుపమరూపవంత సుగుణాఢ్యుని సృష్టి యొనర్ప నెంచి, జీ
వన రచనా కళామయుడు బ్రహ్మ, అపూర్వ రసానుభూతిలో

కని విననట్లుగా అతుల కల్పన చేసి, త్వదీయ ప్రేమ వా
హిని నిడినట్టి జీవకణమే రసికాత్ముడు. మీకు పుత్రుడున్.

భావ మెరిగిన ఆ సతీపతుల నోట
మాట రాలేదు; పులకిత మానసములు
కురిసె ఆనంద బాష్పాలు విరుల వోలె
ఒడలి కదలాడు బుడుతని ఎడదమీద!

శ్రీరమ, శ్రీవర, శైలజ, దీపిక, శ్రీలత, హేమలతా, లలితల్
శ్రీరణధీర, సుధీర, అశోక, హరీష, ప్రభాకర, శంకరులున్
శ్రీ రఘురామ, సుకీర్తి, సుదీప్తి, అలేఖ్య, నితినులు, రోహితులున్
మారుతులై జరిపించిరి ఆ అణి మా రసికోదయ ఉత్సవమున్!

రాజేశ్వరీ, భాగ్య, రాణి, గీతా, ఇందు
　　　　ఆదిలక్ష్మి, తులసి, అనిత, కావ్య
హరికృష్ణ, వెంకటేశ్వర, బబ్బి, భాస్కరుల్
　　　　రామచంద్ర, నరేంద్ర, లక్ష్మణులును
శర్మిష్ఠ, మాధురి, చంద్రకళ, అపర్ణ
　　　　లీల, ప్రార్థన, భాను, పూల, మమత
నారాయణుడు, దయానందుడు, శ్రీరంగ
　　　　రెడ్డి వెంకట్రామరెడ్డి వరులు

కీథు కూపరు, పుత్రీ సమేతముగను
సూజనా, పాల్, విదేశ వాసులు, సుమతులు
బాపురే! శాంత కేశవుల్ బంధుహితులు
వచ్చి, దీవించినారు ఆ పసిరసికుని.

* * *

# సత్యసారథి

శ్రీకరమై సమస్త మతసేవితమై పరమాత్మతత్వబో
ధా కృతియై చిరాచిర చరాచర సృష్టిరహస్యవేద్యమై
లోకవిలోకనా ప్రణవ లోచనమై ప్రభవించె సాయిబా
బా; కరుణా రసార్ణవ శివంకర సుందర సత్యసాయి యై!

సంకువు చక్రమున్ సిలువ చంద్ర కళాభిధలన్ని సాయి ప్రే
మాంక సరోజ పత్రశతమై విలసిల్లెను; వేషభాషలా
టంకము కావు అతని కడానికటాక్షములో తరించగా
శంకలు వంకలున్ కలి విషాదములెల్లయు తీర్చుకోవగా!

ఆకలి తీర్చెడి అన్నదానము కన్న
మిన్నదానమ్ము లేదన్నవాడు
దప్పి దీర్చెడి జలధార లందించుట
కన్న ధర్మమ్ము లేదన్న వాడు
దళితుల పతితుల దరిజేర్చి సాకుట
కన్న వ్రతమ్ము లేదన్నవాడు
వికలాంగులకు సర్వ విధ సహాయము చేసి
ఆదుకొనుటే పుణ్యమన్నవాడు
పలుకు పలుకున సత్యమ్ము చిలుకువాడు
చిదమలానంద క్షేత్రాల సేద్యకాడు
పుట్టపర్తిని కైలాస పురము చేసి
ఇలను పాలించు సత్యసాయీశు డతడు!

సాయిబాబా కనుసన్నలో సంపూర్ణ
విద్యాలయాలెన్నొ వెలసి నిలిచె
సత్యసాయీకరస్పర్శతో శాస్త్రీయ
వైద్యాలయాలు ప్రవర్ధమయ్యె

భగవాను సాయిబాబా సన్నిధే సుప్ర
శాంతి నిలయ భక్తిసౌధ మయ్యె
స్వామి విశ్వప్రేమ సందేశమే దేశ
దేశాలలో జ్ఞానదీప మయ్యె

అతని సంకల్ప సృష్టి భక్తాంతరాళ
కామనలు తీర్చు కల్పవృక్షమ్ము వోలె
ఆయురారోగ్య సౌభాగ్యదాయకాత్మ
శక్తియే భగవాన్ సత్య సాయి స్వామి!

డెబ్బదవ జన్మదిన మని
పబ్బము వేడుకలు చేయ బాబాకు ప్రజల్
కబ్బములు, కళలు, పూవులు
గుబ్బన కురిసినవి అతని గుణ గానములై

(పుట్టపర్తి సత్యసాయిబాబాకు అర్పించిన సమర్పణా పద్యకుసుమాలు)

* * *

# అందరిలో కందుకూరి

సాయుధ విప్లవాలతో సాధించలేని
సంఘ సంస్కరణను
సాహితీ సౌరభాలతో సాధించిన కీర్తి శృంగం
కందుకూరి వీరేశలింగం!
అందుకో మా జోహారులు!
గోదావరి సరిత్తులాగ గుండెను పొంగించావు
ఆదర్శాల, ఆచరణల తీరాలు ఆవరించి ప్రవహించావు

స్వార్థాల మూర్ఖత్వాల సంఘ జీవిత సైకతాలలో
క్రొత్త విలువలు పండించావు
కృషీ పండితుడుగా జీవించావు!

క్షీణ సాహిత్య క్షతగాత్రయైన వాణి,
నారదునికి వినిపించిన వేదనా సందేశం విన్నావు
మూఢాచార నక్ర వక్ర దంష్ట్ర క్రకచాలలో
చిక్కు కున్న సమాజ గజేంద్రున్ని
దేశమాతను, భాషమాతను దీక్షతో, వీరావేశంతో
రక్షించిన వీరేశలింగం పంతులూ!
మేలుకో అందరి డెందాలలో
మేఘావృత మహిళల నేత్రాలలో!

1881, డిశంబరు 11వనాడు
తరతరాలు అనాథలను కరకర కొరుక్కుతిన్న
వైధవ్య పిశాచానికి వజ్రఘాతం కల్పించావు
వేదమంత్రయుక్తంగా తొలి వితంతు వివాహం జరిపించావు
శిశిరం చిందులు త్రొక్కేజీవిత సామ్రాజ్యాలను
వసంతుడవై ఏలుతున్నావు
రాజమహేంద్రవరాన్ని రాజధాని చేసుకున్నావు--

ప్రప్రథమ వచన ప్రబంధం
ప్రప్రథమ ప్రకృతి శాస్త్ర గ్రంథం
ప్రప్రథమ నాటకానువాదం
ప్రప్రథమ ప్రహసన నిర్మాణం
చేసినట్టి, తెలుగు కవుల చరిత్ర వ్రాసినట్టి స్రష్టవు
చరిత్రను నిర్మించుకున్న ద్రష్టవు
అపూర్వ విజయధ్వజశోభితా
అందుకో మా కృతజ్ఞతా గుచ్ఛాలు-

చిరకాల దాస్య శృంఖలలు త్రెంచి స్త్రీలు విద్య నేర్చుకోవాలని
అకాలమృత్యువుకు భర్తలు బలియైన
వితంతువులు వివాహం చేసుకోవాలని
దురాచార తాటకులను తెగటార్చి ధరాతలాన్ని సురలోకం చేయాలని
పంతులూ నీవు మరీ మరీ చెప్పిన పాఠాలను మేం మరచి పోలేదు
అయితే, తెలుగుదేశంలో
నీవు నాటిన వెలుగుతోటలు నీరులేక,
పెంపుచేసేవారు లేక వెల వెల బోతున్నాయి
దురాచారాల, దుష్కృతాల శిశిరఘాతాలకు
విల విల లాడు తున్నాయి -

మనిషిలో దాగి ఉన్న స్వార్థం, సంకుచితత్వం, ద్వేషం
మారు వేషాలు వేస్తున్నాయే గాని మారటం లేదు
ఎన్ని సంస్కరణలు చేసినా ఈ జాతి జాతకం మారటం లేదు--

మట్టి దీపాలకు బదులు విద్యుద్దీపాలు వెలిగించుకుంటున్నాం
కాని మనస్సుల్లోని తమస్సులను వెలిగించలేకపోతున్నాం
నల్ల బజార్లలో ధర్మదీపం నిలపలేక పోతున్నాం
వెలుగులోకన్నా చీకటిలోనే మేము వీర విహారం చేస్తున్నాం-

స్వేచ్ఛ కావాలన్నావు నీవు స్త్రీకి

ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ ఆమెకు
ఏమిటా స్వేచ్ఛ అంటున్నావా
స్వేచ్ఛ లేదు అని చెప్పే స్వేచ్ఛ
స్వేచ్ఛ కావాలని స్వేచ్ఛగా అరిచే స్వేచ్ఛ
ఇచ్చేశాం బొలెడంత స్వేచ్ఛ--
బాల వితంతువులకు పెళ్ళిళ్ళు చేయమన్నావు
చేసేశాం
అయితే, పెళ్ళే వద్దని కూర్చున్న
పెద్ద బాలలు తయారయా రిప్పుడు
సంస్కర్తా! వీళ్ళ సంగతేమిటి?--
కన్యాశుల్కం వద్దన్నావు నీవు
వరశుల్కాలు వచ్చి కూర్చున్నా యిప్పుడు
వీటి నేమి చేయమంటావు?

ఆడవాళ్ళను చదివించమన్నావు
చదివించాం
ఉద్యోగాలు రావటంలేదు సరికదా
వాళ్ళకు పెళ్ళిళ్ళు కావటంలేదు
ఇప్పుడు వీళ్ళనేం చేయమంటావు?
పరిష్కారాలు సమస్యలైపోతున్నవి
సంస్కరణలను స్వార్థాలు కాటేస్తున్నవి
అందుకే ఓ కందుకూరి!
అందరి డెందాలలో ఉండిపొమ్మంటున్నాను
అసురత్వానికి చోటులేకుండా
అంతా నీవే నిండి పొమ్మంటున్నాను

*(1974)*

* * *

# అంబేద్కర్ శరణం గచ్ఛామి

చైతన్య మహానదివై
భరతఖండం నిండా ఆవరించిన నీవు
శిలవై పోయావా!
దళిత జాతుల హృదయ కుహరాలలో
ఆశాదీపంగా వెలగిన నీవు కలవై పోయావా!
సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం సర్వస్వం త్యాగం చేసిన నీవు
భారత స్వరాజ్య లక్ష్మికి
పవిత్ర రాజ్యాంగాన్ని ప్రదానం చేసిన నీవు
శిలవు కాదు - కలవు కాదు
మానవతా వాద శిఖరాల మంచు మలవు
ఎలా అర్పించను నీకు జోహారులు
ఈ నీ జన్మదినోత్సవం నాడు
వెలుగు చీకట్ల మధ్య పోరాటం విజృంభిస్తున్న నేడు.
ఇన్నేళ్ల స్వరాజ్యరమ ఎన్ని ఎన్నికల వేడుకలు చేసినా
ఎన్ని ప్రగతి పథకాలు వేసినా
నీవు ఆశించిన జాతి స్వాతంత్ర్యం నిజం కావటం లేదు.
డిమోక్రసీని హిపొక్రసీ నడిపిస్తున్నది
ప్రజా జీవితాన్ని స్వార్థం పట్టి పీడిస్తున్నది
సమానత్వం ఆశించే వాళ్లకు
అసమానత్వం సమానంగా లభిస్తున్నది.
నీకు తెలియందేముంది బాబా సాహెబ్ అంబేద్కర్!
మన పెద్దమనుషుల బుద్ధులు
మారువేషాలు, మాయవేషాలు వేస్తున్నాయేకాని మారడం లేదు
శంకరాచార్యుల "మాయావాదం" చేస్తున్నది దేశంలో గారడినేడు
ఉన్నాయంటే అన్నీ ఉన్నాయి దేశంలో
లేవంటే ఏవీ లేవు - అంతా మిథ్యా

అస్పృశ్యత పోయిందా అంటే పోయింది - ఋజువు అడగొద్దు
పోలేదంటే పోలేదు కారణాలు అడగొద్దు-
మతం నల్లమందని అంటే
మధుపానంలా దాన్ని సేవిస్తున్నారు
కులభేదాలు పోవాలని నీవంటే
కులాలవారిగా సంఘాన్ని విభజిస్తున్నారు
"కులనిర్మూలనం" నీవు కోరితే మాటను కొంచెం మార్చి
కుల నిర్మాణం చేస్తున్నారు
కులవ్యవస్థను పునర్నిర్మాణం చేస్తున్నారు
నిన్ను పబ్లిక్‌గా స్మరిస్తున్నారు ప్రయివేటుగా విస్మరిస్తున్నారు-
అపూర్వమూ అమోఘమూ అయిన
భారతీయ కులమత పద్మవ్యూహాన్ని ఛేదించలేక నీవే
"బుద్ధం శరణం గచ్ఛామి" అంటే
చావగా మిగిలిన సంఘ సంస్కర్తలు
"మరణం శరణం గచ్ఛామి" అనుకుంటున్నారు.
మళ్లీ ఒకసారి అవతరించు అంబేద్కర్
"సంభవామి యుగే యుగే" సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నానని కోపగించవద్దు
అవతారపురుషుడు వస్తేనే తప్ప
ఈ దేశంలో ఏ కాలంలోనూ అధర్మాన్ని అణచడానికి వీలులేదు
పదకొండవ అవతారం ఎత్తిరా
విష్ణువు అవతారంగా కాదు
శివావతారంగా రా - ధర్మరుద్రావతారంగా రా
నీ ఆశయాలకు చెదరిపోని ఆకారం కల్పించడానికి
అంతరంగాలలో దాగిన వింత శత్రువులను జయించటానికి
కావలసిన ఆయుధాలు ధరించి అర్జంటుగా వచ్చేయి-

*(1974)*

* * *

# అస్థి వేణువులు

క్రూర కుటిల కుతంత్ర హస్తం
చీల్చిన ఎదలో నుంచి
వెలుగు పూల పొదలో నుంచి ఎగసి పోయిన
పవిత్ర భారతి సవిత్రి స్వప్నాలు
ప్రగతి దీపాలై నేడు ప్రజ్వలిస్తున్నవి
చేతనా కేతనాలై ప్రచలిస్తున్నవి·

మూగవోయిన బోసినోటినుంచి
మోడు వారిన పాటల తోటనుంచి
చెదరిపోయిన హరే రామ చిలుకలు
ప్రేమరాగ కోకిలలు
మళ్ళీ గూళ్ళు కట్టుకుంటున్నవి మామూలు మనిషి గుండెల్లో;
శైశిర భయం లేని సామ్యవాద వృక్షశాఖల్లో

సామ్రాజ్య వాదాన్ని సమరోన్మాదాన్ని
గజగజలాడించిన, ఓడించిన ఊతకర్ర
తాత చేతినుంచి జారిపోయి
ఈ వాడు జాతికి జీవగర్ర అయింది-

ఈ మట్టిని ప్రేమిస్తే మణులు దొరలి పడతాయి
ఈ రాళ్ళను సేవిస్తే అమృతం ఒలికి పడుతుంది

అంటూ ఘోషిస్తున్నవి మాట్లాడ నేర్చిన మట్టి రేణువులు
యమునా తీరంలో దాగిన అస్థి వేణువులు-

అక్టోబరు రెండువాడు అవిర్భవించిన
ఆరిపోని వెలుగు వాకలు
జగన్మోహన భావరేఖలు

పల్లెసీమల్ని పల్లవి చేసి
ప్రగతిపాట పాడుతున్నవి
మానవతను పరిధి చేసి జీవిత వృత్తాలను అల్లుతున్నవి-

స్వచ్ఛంద అమరగానం వినండి
జాతి జ్యోతి అమృతరూపం కనండి
బాపూజీ భావ పుష్పాలతో
భారతావని పరిమళించనీయండి-

అదుగో!
ముప్ఫై ఏళ్ళ క్రితం
ముప్పయవ జనవరినాడు
రాగరాగోద్దీప్త మహాత్మ చిందిన రక్తకణాలు
స్వేచ్ఛాలక్ష్మి ఇంటిలో క్రమ్మిన చీకట్లను ఛేదిస్తున్నవి
నిర్బల, నిరీహ జీవితాలలో నవచైతన్యం కలిగిస్తున్నవి-

సామాన్యునికి అర్థం కాని సంకుచితత్వభాషలో
హిపాక్రసీ ఇచ్చే ఉపదేశాలకు
ఇక స్వస్తి చెప్పాలి

*(జాతిపిత మహాత్మాగాంధి 30వ వర్ధంతి సందర్భంలో)*

* * *

# ప్రజాబంధు రాజాబహదూర్

ఏడీ! రాజా బహదుర్ వెంకటరామారెడ్డి
ఎక్కడా కనిపించడే
తన శతజయంతి ఉత్సవాలలో తానే ఎక్కడా అగుపించడేం!
అధ్యక్షా!
అతనికి ఆహ్వానం పంపించలేదా?
ఈ మధ్య ఆయన ఎక్కడున్నదీ ఎవరికీ తెలియదా?
మనం సాధించిన ప్రగతి చూచి అతనికి సంతృప్తి కలగదనుకున్నారా?
అయినా, అతనికి ఆహ్వానం కావాలా
తన ఇంటికి తాను రావటానికి ఒకరి పిలుపు కావాలా!

అయ్యో! మనం గమనించనే లేదు
అదుగో అక్కడే నిలుచొని ఉన్నాడాయన
నమస్కారం రాజాబహదూర్
అంత దూరంగా నిలుచుని ఉన్నారా
మీ ఉత్సవాల సందడిలో
మిమ్మల్నే మేము గుర్తుపట్టలేదనుకున్నారా
రండి రండి వేదిక మీదికి దయచేయండి
అధ్యక్షుల అనుమతితో
అందరి పక్షాన ఆహ్వానిస్తున్నాను రండి
మా కృతజ్ఞతాక్షరమాల స్వీకరించండి-
ఆరిపోని దీపం వెలిగించి
అగుపించకుండా పోయారు మీరు
జాడతెలియకుండా పోయారు మీరు
మిమ్మ కళ్ళతో చూడని చిన్నవాళ్ళం మేం
అయినా మీ వెలుగు ఛత్రం క్రింద కులాసాగా ఉన్నవాళ్ళం

మీరు పెట్టిన విద్యా గంధంతో బ్రతుకులు పండించుకుంటున్న వాళ్ళం
హైదరాబాదు ఎంతమారిపోయిందని ఆశ్చర్యంగా ఉందికదూ మీకు,
ఆంధ్రప్రదేశ్ పరిస్థితి చూస్తుంటే అయోమయంగా ఉందికదూ మీకు,
నాలుగు భాషలు మాట్లాడేవాళ్ళు
నవ్వుల పువ్వులు రువ్వుకునేవాళ్ళు నాడు
ఒకేభాష మాట్లాడే తెలుగువాళ్ళు
ఒకరిపై ఒకరు రాళ్ళు రువ్వుకుంటున్నారు నేడు!
నమ్మినదేదో చేశారు మీ రానాడు
తాము నమ్మనిదాన్ని నమ్మిస్తున్నారు నేడు-

తలుపులు మూసి లోనికి రమ్మనేవాళ్ళు
పొమ్మనలేక పొగబెడుతున్న వాళ్ళు
నవ్వలేక ఏడ్చేవాళ్ళు
ఏడ్వలేక నవ్వేవాళ్ళు
సంఘంలో ప్రతిరంగంలో పెరిగిపోతున్నారు
మీ వంటివా రున్నారంటే నమ్మలేమంటున్నారు-

మీ పేరులో కులం ఉంది
కాని మీకు కులతత్వం లేదు
ఇప్పుడు పేర్లల్లో కులం కనిపించకపోయినా
కులతత్వం వెర్రితలలు వేస్తున్నది-
'ఎందరో మహానుభావులు'
అందరూ అంధకారంలో ఓ దీపం వెలిగించిన వాళ్ళే,
మీరుమాత్రం జీవితాన్నే ఆరని దీపంగా వెలిగించారు!
నాడు అధికారాన్ని
ప్రజాక్షేమంకోసం ఉపయోగించటం మీకుతెలును
నేడు అధికారాన్ని క్షేమం కోసమే ఉపయోగిస్తున్నారు

తమ సొంత క్షేమం కోసం!
మీ చేతిలో అధికారం నిత్యదీపమై వెలిగితే
నేడు సుడిగాడ్పయి ఉన్నదీపాలను ఊదేస్తున్నది
అలా తగదన్న వాళ్ళ కళ్ళల్లో దుమ్ముకొడుతున్నది-

పరిమితమైన పొలంలో మీరు
త్యాగమనే నాగలి పట్టి
ఎంతో కొంత ప్రేమను పండించారు
సువిశాలమైన క్షేత్రంలో మేము
స్వార్థమనే ట్రాక్టర్లు పెట్టి
బోలెడంత ద్వేషాన్ని పండిస్తున్నాము!
అందుకే మీరిక్కడే ఉండిపోవాలంటున్నాను
అందరి డెందాలలో అమృతం పండించాలంటున్నాను
మీ రెండవ శత జయంతి ఉత్సవాలకు
మేము హాజరు కాలేకపోవచ్చు
అయినా ఆ మహా సభలు
ఇంతకన్నా శోభాయమానంగా వెలిగిపోవచ్చు
కోత్వాల్ వెంకటరామారెడ్డి గారూ
ఇక మా రక్షణ భారం మీరు వహింపవచ్చు.

*(12.11.1972నాడు రాజాబహదూర్ వెంకట రామారెడ్డి శతజయంతి ఉత్సవాల సందర్భంలో హైదరాబాదులో జరిగిన బ్రహ్మాండమైన కవిసమ్మేళనంలో పలికిన కవిత)*

* * *

# తేజశ్శిఖరాలు

అరవై వసంతాలు చిరునవ్వులై విరిసిన
విచిత్ర జీవిత బృందావనంలో విహరించే గోపాలుడు
గోదావరీ యమునా తీరాలలో
కళ్యాణ వేణుగానలోలుడు
పసిబాలుడు షష్టిపూర్తి చేసుకుంటున్నాడట
చూచివద్దాం రండి-

సిరిపుర సవిత్రి కన్న ఈ చిన్నారి చెన్నారెడ్డికి
సమస్యలతో ఆడుకొనే అల్లరి పిల్లవానికి
అఖిలాంధ్ర నాయకుడైన ఆనందవర్ధనునికి
అప్పుడే అరవై నిండాయంటే
ఆశ్చర్యంగా ఉంది కదూ!
అదుగో!
అనంతత్వ తత్వ తారాపథంలోనికి
ఆలోచనా రాడారులు విసిరే
ఆయన నిర్నిద్ర చకచ్చకిత చంచన్నయనాలలో
భారతి వికచాశయాలు భాసిస్తున్నవి
భవిష్యత్తు గరుత్తులు ప్రచలిస్తున్నవి-

సూటిగా చూసే ఆ ముక్కుమీద
మొక్కవోని మేటి మేధాశక్తి విద్యుద్విన్యాసం చేస్తుంటే
చిద్విలాస శివతాండవం ఆడుతుంటే
పాలనా యంత్ర మత్తేభం వేగాన్ని పుంజుకుంటున్నది
సోమరితనం శివశివా అంటూ కిటికీ దూకి పారిపోతున్నది
తాబేలు కాబోలు అనుకున్న ప్రగతి
కుందేలులా ముందుకు సాగుతున్నది

కరుడుకట్టిన పేదల బ్రతుకుల్లో గంగానదులు స్రవిస్తున్నవి-

శ్రీరామ రామ రామాక్షర శ్రీకార ఓంకార స్వనాలు
ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో ఉయ్యాల లూగుతున్నవి-

నరలోకపు పొదుల్లో నుంచి సురలోకపు పందిళ్లపైకి
అలవోకగా తీగలు సాచుతున్నవి ఆయన నిసర్గ భావనాలతలు-

అటు చూడండి, ఆయన అరచేతుల్లో ఆడుకునే
రజతాంచల రక్షాదండం
అశేష పీడిత జనవాటికి అభయకోదండం వలె లేదా!
నేటికి, ఏనాటికి, ముమ్మాటికి
జలచర, భూచర, ఖేచర కోటికి
అది త్రివిక్రమ త్రికాలదండం కాదా!
ఎదుటివాని ఎంతటి విషాన్నైనా విరిచి
అమృతంగా మార్చగలిగే
ఓషధుల్లాంటి ఆయన పెదవులపై
ఆకలికి అన్నం పెట్టే
అమ్మలాంటి అమాయిక దరహాసం అవలోకించరా!
అరవై రంగుల సింగిణుల వెనుక
అనుభూతుల్ని నెమరువేసే
ఆయన బుద్ధాత్మక శిరశ్శితాచల తేజశ్శిఖరాలమీద
చల్లండి- అభినందన చందనపింజాలు
చల్లండి- అహం బ్రహ్మాస్మి అంటూ
అక్షరాక్షతల పుంజాలు.

*(జనవరి 13, 1979 డా. మర్రిచెన్నారెడ్డి షష్టిపూర్తి అభినందన సంచిక)*

* * *

# క్రీస్తుసంస్మరణ

పసులపాకలో పుట్టిన శిశువు నీవు
ప్రపంచాన్ని జయించావు
స్వప్నాల కడుపులో పుట్టిన దీపకళిక నీవు
సత్యాల సూర్యుడివై నిలిచావు-

అన్యాయాల అక్రమాల ఎడారిలో
అమృతవాహినివై ప్రవహించావు
అజ్ఞానాల అసహనాల చలిలో ఆత్మజ్ఞానమై
ప్రేమజ్వాలవై ప్రజ్వలించావు
"బెత్లహేము" మట్టిలో ప్రేమవాణివై రవళించావు
అంధకార జీవితాకాశంలో
ఆశాతారవై ప్రభవించావు
ప్రాచీన వేదోపనిషత్ ప్రజ్ఞాన వసంతాన్ని
స్వార్థపర శిశిర ఘాతాలు
సంకుచిత సమర గీతాలు పీడించాయి-

పరిణామ వేదిక మీద
ప్రబుద్ధాత్మ చేసిన ప్రబోధాలను
పాశవికత పరిహసించింది
నిర్మల సమతా ధర్మాన్ని నిరంకుశత్వం పరిహరించింది
నిర్బల నిస్సహాయ మానవాళి నింగివైపు చేతులెత్తింది-

తత్వాల సారమంతా మానవత్వంగా రంగరించి తెచ్చిన
మహోన్నతమూర్తివి, నిన్ను "మెస్సయా" అన్నారు
అలవోకగా నీవిచ్చిన ప్రేమసందేశాన్ని
ఆబాల గోపాలం విన్నారు-

దైవత్వం దానవత్వం మనిషిలో దాగిఉన్న వెలుగు చీకటులు-
చీకటి వెలుతురుతో చెలగాటం ఆడుతూనే ఉంది
దానవత్వం దైవత్వం మీద దాడి చేస్తూనే ఉంది

అందుకే రామునివలె కృష్ణునివలె
బుద్ధునివలె జైనునివలె
మాయా రాక్షసత్వం నుంచి మనిషిని రక్షించడానికి నీవు
మార్గం అన్వేషించావు
కామరూపియైన సైతానును కనిపెట్టి జయించావు-

ఇరువై శతాబ్ధాలుగా ఏసువై దివివాసివై
నీవు పాలిస్తున్న ఈ లోకం
ఇంకా పాప పంకిలంగానే ఉంది
కళ్ళుండీ చూడలేని వాళ్లు
చెవులుండీ వినలేని వాళ్లు
సకలాంగాలు ఉన్నా వికలాంగులైపోయిన వాళ్లు
సత్యాన్ని సిలువవేస్తున్న నిత్య విద్వేష కిరాతకులు
నరలోకాన్ని నరకలోకం చేస్తూనే ఉన్నారు-

పరిశుద్ధాత్మ పరిమళించే నీ ప్రేమ భావ వృక్షం క్రింద
క్రిస్మస్ పేరుతో
మనిషి రూపంలో ఉన్న దైవానికి
నీవు పుట్టినరోజు పండుగ చేస్తున్నాను
ఈ లోకాన్ని నాకంచేసే నీ సందేశాన్ని
సకలజన సంహితంగా సమర్పిస్తున్నాను

* * *

# కాలవేదికి కవితోపాయనం

అంటరానితనం అనే అమానుష రాక్షసత్వం
కులతత్వం అనే క్రూర కుటిల మూర్ఖత్వం
భారత జాతిని పట్టి పీడిస్తుంటే
ధైర్యంలేని ధర్మరాజులు సహిస్తుంటే
సాటిలేని విజ్ఞాన ప్రజ్ఞాన చక్రంతో
వాటిని ఎదిరించిన ఏకైక విప్లవ రథసారధి అంబేద్కర్-
మాటలు నేర్చిన మలినత్వాన్ని
మాయలు నేర్చిన మతతత్వాన్ని
నిత్య సత్య శౌద్ధంతో నిర్మలధర్మ బౌద్ధంతో
ప్రక్షాళనం చేయబూనిన అపూర్వ జాహ్నవి
అంబేద్కర్-

ఆత్మజ్ఞాన ప్రసూనాలు సమతానంద నాదాలు
పరిమళించిన వేదోపనిషత్ వృక్షంమీద
సుందర హైందవ సమాజంమీద
విరుచుకపడ్డ గబ్బిలాలను
గూళ్ళు కట్టుకున్న గుడ్లగూబలను
చైతన్యకాంతి శరాలతో చెదరగొట్టిన భీమధనుస్సు
అంబేద్కర్ మహోషస్సు-

దురాచార శిశిరఘాత దుర్బల జీవనంలో
నవజీవన వాసంతంగా చివురించిన ఋతంభరుడు
అంబేద్కరుడు-

అహం బ్రహ్మాస్మి త్వమేవాహం అన్న
అద్వైతపు నొసటిమీద అసమానత్వపు రేఖలు గీసి
అయోమయత్వపు రంగులు పూసి
వికృత తాండవం చేసిన వెర్రి మొర్రి విన్నన్నలకు

మానవత్వం బోధించిన ఆ మహర్షి పుట్టినరోజు
నా మాతృభూమి పులకించింది
నా నోట కవిత పలికించింది-

ఒప్పుకున్నట్లే ఒప్పుకొని తప్పుకొనే తంత్రం మనది
"మార్పు" రాకుండా మార్పులు చేసే
మాయామయ మనస్తత్వం మనది
అందుకే అంబేద్కర్ పుట్టిన రోజు
అస్పృష్టతకు తావులేని
అభ్యుదయ శాసనం చేస్తున్నాను
చట్టాలన్నిటికీ అర్థం కల్పించే చట్టం చేస్తున్నాను
కులనిర్మూలన చట్టం చేష్తున్నాను-

"కులం" అంటే
మనకు మనం పులుముకొన్న మలినం అని నిర్వచిస్తున్నాను-

"కులనిర్మూలనం" అంటే
మనిషిని మనిషిగా మార్చటం అని ప్రవచిస్తున్నాను-

విధిగా, మానవ విధిగా స్త్రీ పురుషులు
కులాంతర వివాహాలు చేసుకొని సమతా ధర్మంతో
స్వకుల విషవృక్షాన్ని
సమూలంగా పెరికివేయమంటున్నాను
చట్టపరమైన కులనిర్మూలనాన్ని
సంపూర్ణంగా సమర్థించుమంటున్నాను-

*(డా. అంబేద్కర్‌కి అర్పించిన నీరాజనం)*

* * *

# చిరునవ్వులతో తోటమాలి

నింగిలో చందమామ తొంగి చూచినప్పుడు
మనిషిలో ఆత్మీయత తొణకిసలాడినప్పుడు
నీవు ఈ లోకాన్ని విడిచిపోలేదని
నీవు మాకు నిజంగా దూరం కాలేదని
విశ్వసిస్తున్నాము- నిశ్వసిస్తున్నాము.
అర్థం లేని అర్ధరాత్రి హఠాత్తుగా అదృశ్యమైపోయావు
నీవు ఎక్కడుండేది- ఏం చేస్తుండేది చెప్పకుండా వెళ్ళిపోయావు.
నయాగరా జలపాత చైతన్య ధారలో
నగ్నంగా ఆడుకుంటున్నావని కొందరు
మానవతా మంగళస్వరలహరిలో
మౌనంగా పాడుకుంటున్నావని కొందరు
వాణీ వీణా శ్రుతుల్లో లీనమైపోయావని కొందరు
ఆకాశవాణి గళంలో గానమై పోయావని కొందరు
ఊహాగానలు చేస్తున్నారు - నీ ఉనికిని గుర్తిస్తున్నారు
స్వార్థం పరమార్థం అయిపోయిన నేటి సంఘ జీవన శిశిరంలో
స్నిగ్ధ సుకుమార సుందర స్నేహం వాడిపోకుండా
సుధాధారలు క్రుమ్మరిస్తున్న శశాంకుడివిగా
చిరునవ్వుల తోట. మాలిగా
నిత్యం దర్శిస్తున్నాం నిన్ను అందరం
నీ నిర్మల శ్రమాయాస ఘర్మబిందువుల్లో
నీరైపోతున్నాం కన్నీరైపోతున్నాం

*(సాహితీ బంధువు ఓలేటి శశాంక అకాల మరణం చెందినప్పుడు లేచిన ఆవేదనా తరంగం)*

* * *

# రసరాజ్య పట్టాభిషేకం

ఇది నా
నవభావనా శిఖరాలనుండి
నవ జీవన వనాంతరాల నుండి
ప్రవహించిన మరో కావ్య కూలంకష
ఇది నా

అనంత స్వాప్నిక రోదసీ యాత్రలో
అపూర్వానుభూతి క్షేత్రంలో
మరో కావ్య కల్పం
ఇది నా సరసోహాకాసారంలో
జన్మ జన్మాంతర వాసనా వల్లిక పై
వికసించిన మరో కావ్య శత పత్రం
ఇది నా రసతపో రసాతలంలో
రమ్య కళాక్ష్మా గర్భంలో
బయల్వడిన మరో కావ్య రత్నం-

రసతరంగ సాహితీ సాగరా
రాగగగన సుధాకరా
నిత్య నూతన చేతనా వసంతా
సత్య వాగ్రత్న కిరీటా
అందుకే నీకు ఈ కావ్యం
అంకితం కావటం భావ్యం
బెజవాడ గోపాలరెడ్డీ!
పేర్మితావుల పసిడి కడ్డీ!

తెలుగు రాజ్య రమాకింకిణీ నిక్వాణంలో

తెలుగు శారద ప్రసన్న వీక్షణాలలో
భారతమాత సేవాసక్తిలో
భారతీ విభవోద్దీపనానురక్తిలో
ఆత్మను వెలిగించి అధికార విముఖుడవై
సాగిపోయే సుహృత్ సమ్రాట్
శాంతి నికేతన కేతన స్వరాట్
ఈ కావ్యం నీకు అంకితం కావటం
గంగ శివునిదై పోవటం
రాధ మాధవుని దైపోవటం-

ఢిల్లీలో మంత్రివైనా పల్లెటూరిలో రైతువైనా
బుచ్చిరెడ్డి పాలెంలో ఉన్నా
అచ్చరలోకాల తేలిపోతున్నా
బాలుడవై శాంతినికేతనంలో వెలిగినా
రాజ్యపాలుడవై లక్నోలో మెలిగినా
సాహిత్యం ఆహారంగా సంగీతం పానీయంగా
లలితకళలు కుటీరంగా
జీవించే కళా తపస్వీ
స్వీకరించు ఈ రసరాజ్యం
రాగ బాల గోపాలా త్యాగరాజ గోపాలా
భోగవేణు గోపాలా
నీవిశాల యశస్సాధంలో నిత్యం వెలిగే దీపం ఇది
నీ రసరాజ్య పట్టాభిషేకానికి
నిరుపమాన పీఠం ఇది- నా హృది

*(1970లో "గద్యకావ్యాలు" డా. బెజవాడ గోపాలరెడ్డిగారికి అంకితం చేసినప్పుడు)*

* * *

# బంగ్లా బంధు షేక్ ముజీబ్

పూర్వదిశా దాస్య నిశావలయాన్ని
చీల్చిన ఓ సూర్య భగవాన్
స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ప్రాణం పోసిన
షేక్ ముజీబు ర్రహమాన్!
ప్రజా ప్రహ్లాదుణ్ణి పరాభవించడానికి
ప్రజాస్వామ్య గజస్తంభాన్ని తన్నిన
నిర్దాక్షిణ్య నిరంకుశత్వ రాక్షసత్వాన్ని
నిలువునా చీల్చిన విజయోజ్వల నరసింహా!

పదిహేనుకోట్ల బంగ్లాదేశ ప్రజా కరాలు
ప్రజాద్రోహి వక్షం చీల్చిన వజ్ర కరాలు
బంగ్లా వీరులు కార్చిన ప్రతి రక్త బిందువు
వలసాధిపత్యాన్ని ముంచెత్తిన విప్లవ సింధువు.

సీతను చెరగొన్న రావణునికి నీతిని చెరగొన్న హిట్లర్‌కు
అమాయక ప్రాణాను బలిగొన్న మాయావి బకాసురునికి
సత్యాన్ని, సమత్వాన్ని, ధర్మాన్ని
చిత్రహింస పెట్టిన దుర్యోధనునికి పట్టిన గతే పట్టింది
నిను చెరబట్టిన నరహంతక నియంతలకు.
ప్రజాస్వామ్య ప్రగతీందిర
స్వాతంత్ర్య సమర దీపేందిర
బంగ్లాదేశ్ ప్రజా విజయేందిర
శాంతినికేతన క్రాంతి రథాలపై
నవ్యాశా దివ్యాశయ పథాలపై
కదలివచ్చి నీ కలలను పండించారు
పారతంత్ర్యాన్ని బంగాళాఖాతంలో లోతుగా పాతిపెట్టారు.

ముక్తివాహినీ దేశభక్తి తరంగాలు
స్వాతంత్ర్య భావ విద్యుత్ విస్ఫులింగాలు
నింగినీ నేలనూ ఆవరించాయి
బంగ్లాదేశ వీర విప్లవ జండాలపై
ఖండ ఖండాలలో తాండవించాయి.

మతం అనే నల్లమందు వేస్తే స్వేచ్ఛా సింహం నిద్రపోదు
బూటకాల నాటకాల వేషాలకు ఓటు హక్కు మోసపోదు
స్త్రీలను మానభంగం చేసే శిశువులను కూడా హత్య చేసే
పశుత్వాన్ని ఎదిరించారు
పరశురాములై పసివాళ్ళు, పడుచువాళ్ళు
కొడవళ్ళ వలె నడుములు వంగిన ముదుసలివాళ్ళు
అసిధారా తీక్షణేక్షులు సత్యభామా తుల్య భామినులు.
నీ నిరుపమ నాయకత్వంలో
రోషం, పౌరుషం పర్జన్యాలై గర్జించాయి
నీరుకాదు నిప్పు కణాలు కురిపించాయి.
చెట్ల కొమ్మల మాటునుంచి కొండకొమ్ముల చాటునుంచి
స్వాతంత్ర్య భండనరాములు శత్రు మూకలను కూల్చారు
దీక్షా కోదండ పాణులై రక్షా శంఖం పూరించారు-

స్నేహ భావబంధాలలో చిర సంస్కృతీ గంధాలలో
రవీంద్ర కవీంద్రుని రమ్య కవితా జ్యోత్స్నికలలో
నీవు సాధించిన భారత బంగ్లా మైత్రి
కలకాలం వెలుగుతుంది.

*(1971 బంగ్లా విజయోత్సాహంలో)*

* * *

# కన్నతండ్రి కడసారి కానుక

నను కన్నతండ్రి
తన ఆత్మోద్దీప్త తనువులో
అదుపులేని కాలపు
ఎనుబదియారు వత్సరాలను
చేరదీసి ప్రతిష్ఠించుకున్నాడు
వాటిని
మమతలతో, మందహాసాలతో
తలపులతో త్యాగాలతో
వలపులతో వాత్సల్యాలతో
కలలతో- కాంక్షలతో
పోషించాడు-

తైలాభిషిక్తమైన
తన భౌతిక కాయాన్ని
ఎగసిపోతున్న ఆత్మ
ఇచ్చి పోయిన కానుకగా
నాకు బహూకరించాడు
జాలు వారే నా కన్నీటిలో
కదలలేని ఆ కళేబరాన్ని అభిషేకించి
భగభగమండే నా భావచితిపై
దహనసంస్కారం చేశాను
నా అవ్యాజ ప్రేమపాత్రలో
చితాభస్మాన్ని సేకరించి
సాగరాల అగాధాల నిశ్శబ్దతలో
సౌభాగ్యాల పేటికగా

భద్రపరచాను-

పాటలు పాడే ఏటి కెరటాల మీద
పసిడి పూలుగా వెదజల్లాను
సుప్త చైతన్యపు
అవంధ్య గర్భాశయంలో
దీప్తి బీజాలుగా నాటాను
ఇప్పుడు
ఆయన ప్రతిబింబం
సురభిళ స్మృతుల చట్టంలో
తీర్చిన ఒక స్వప్నమై
నా చిరంతన అజ్ఞాన కుడ్యం మీద
నిరంతరం వ్రేలాడుతున్నది!

*(కన్న తండ్రి జంకె కృష్ణారెడ్డి 1987లో దివంగుడైనప్పుడు కలిగిన అక్షరానుభూతి)*

* * *

# యూనస్ ఎమ్రీ

పదిహేను దశాబ్దాల క్రితం
మహాశక్తిశాలి, అతులిత వితరణ శీలియైన
కాలబ్రహ్మ
మానవలోకానికి ప్రసాదించాడు
ఒక అత్యద్భుత పుష్పం
ప్రేమతత్వ సార రూపం
వృక్షశాస్త్ర భాషలో "ఏకత్వ జీవితత్వం"
కవితా పరిభాషలో "యూనస్ ఎమ్రీ"

మానవుడు ఎవరు?
ప్రతి మనిషి మనస్సును కలవరపెట్టిన ప్రశ్న?
మానవుడే దేవుడు

ఎమ్రీ ప్రవచించిన సమాధానం!
అవును, దేవునికి ఊరూ పేరూ లేవు
అతడు మానవ రూపానికి ప్రాణం పోస్తాడు
అతడు గోచరుడు - అగోచరుడు
దాగుడు మూతలాడుతాడు
దా చేస్తాడు - శోభిస్తాడు అద్భుతావహ జీవిత క్రీడలో
"నేను భూమిమీదికి వచ్చింది కలహాలకు కొట్లాటలకు కాదు
ప్రేమేనా జీవిత ధ్యేయం
ద్వైత భావం నన్ను విడనాడాలి
దేవుడూ - నేనూ విడివిడిగా ఉండరాదు"
అంటూ "ప్రేమోద్యానం"లో క్రీటుకొని
పాడుకున్నాడు గానకోకిల యూనస్ ఎమ్రీ
ఆయన వాణిలో సనాతన వేదనాదాలు ప్రతిధ్వనించాయి

టర్కీ నుండి, ప్రాక్ పశ్చిమదిశాంతాల వరకు
తన ప్రేమ హస్తాలను సాచి
పరమానందాను భూతిలో
ఇంపైన ఇలా గోళాన్ని కౌగిలించాడు.
ఆయన మొరటు పాదాలు మట్టిని పరీక్షించాయి
ఆయన సున్నిత ధార్మిక మానసం
పరమానంద కర శ్రావ్య స్వరాల
ఆరోహణ అధిరోహణలో స్వర్గద్వారాన్ని తట్టింది

"దివ్య జీవితాన్ని భూమిమీదే అనుభవించు
మతం మత విశ్వాసం నీ అభిమత మైతే
అవినీకు దివిలో ప్రాప్తించవు
ఇక్కడ భువిలో నేడు అనుభవిస్తేనే తప్ప"
ప్రవచించాయి ఉభయలోకాలు
ఈ పరిపూర్ణ సత్యాన్ని
ఆ ప్రజ్ఞానాత్మున్ని
దైవావేశ గళంతో

యూనస్! యూనస్! యూనస్! ఎమ్మీ అంటూ
కాలం గుర్తించింది
మానవ వేషంలో సంచరిస్తున్న కాలాతీత దేవున్ని

యూనస్ రొట్టెకంటే వివేకం మేలన్నాడు
జననం - మరణం కల్పిత కథ - వాస్తవికత
ప్రేమ - నీతి - దైవత్వం - మానవత్వం వంటి

అంతు పట్టని నిగూఢాంశాలను
దేహాత్మల మైత్రీ బంధంలో జోడించాడు ఆయన

ఈ లోకపు అజ్ఞాన భారాన్నంతా
ప్రేమ ప్రభా ధారల్లో కరిగించి వేశాడు

బుసకొట్టే విద్వేష విష ఫణి పణాలను మచ్చిక చేశాడు
వంకర టింకర్లు పోయిన వంట చెరుకుల్ని చక్కబరచాడు
ఆయన సత్యశ్రుతిలో సజీవ నిర్జీవాలు సమ్మిళితమై పోయాయి
ఆయన సన్నిధిలో
గతాగతాలు పరిస్పరాలింగనం చేసుకొని
పరవశించి పోయాయి
మనిషి మరణిస్తాడు కాని మానవజాతి జీవిస్తుంది
యుగాలు చెల్లిపోతాయి కాని
ఎమ్రీ మాత్రం బ్రతికి ఉంటాడు

ఉజ్వల చరిత్ర ప్రతి ప్రకాశ చిత్రం ముందు
కళకళలాడే ఇస్తాంబుల్ నగరంలో
తళతళలాడే తూర్పు ద్వారం వద్ద
సమైక్యంగా నిల్చిన దేశదేశాల కవులు
మధ్య ధరా సాగర సమీర స్ఫూర్తి తో
తన్మయాత్మక కవితారాగ బద్ధంగా
ఈనాడు, యూనస్ ఎమ్రీ
అపార శక్తి శోభలను సంస్తుతిస్తున్నారు

*(1991, సెప్టెంబర్ 16-20 లో ఇస్తాంబుల్ లో జరిగిన 12వ ప్రపంచ కవుల సమ్మేళనంలో టర్కీ దేశపు ప్రఖ్యాత కవికి పట్టిన కవితాంజలి - స్వీయ ఇంగ్లీషు కవితకు అనువాదం)*

* * *

# సత్య శ్రీనివాసం

నవ్వుకుంటూ నవ్వుకుంటూ రివ్వున ఎగిసిపోయావు
మాట్లాడుతూ మాట్లాడుతూ మాయమై పోయావు
ఎక్కడికి వెళ్ళిపోయావు?
నీవు స్వదేశంలో లేనప్పుడు విదేశాలకు వెళ్ళావని
సమాధానం చెప్పే నీ సతీమణి
ఇప్పుడు ఏదేశం వెళ్లావో చెప్పలేక కన్నీరైంది-

ఈ లోకాన్ని నాకం చేయాలని పోరాటం అరాటం సాగించిన
మానవతా వాదివి నీవు అభ్యుదయ వేదివి నీవు
అసలు స్వర్గం ఎలా వుంటుందో చూచి వద్దామని వెళ్లావేమో
విశ్వ వీధుల్లో వెతుకుతున్నావేమో!
తిరుగులేని మార్గంలో తీర్థయాత్రకు వెళ్ళావని
తీరా తెలిసికొంటున్న కొలది మతి పోతున్నది మాకు
మనసిచ్చిన నీ స్నేహితులకు-

ఉపకారాల పువ్వులే తప్ప అపకారాల ముళ్ళ లేని
ఆత్మీయతా వల్లరి నీ జీవితం
మెత్త మెత్తని మాటలతో కుత్తుకలు కోయడం తెలియని
పరుషవాక్కు నీది - పౌరుషవాక్కు నీది-

వ్యాపారాన్ని ఎగుమతి చేసి
స్నేహాన్ని దిగుమతి చేసిన సత్యాన్వేషివి నీవు
నీతిని నిజాయితీని నిత్యజీవితం చేసుకున్న
ఇక్కడ కె. శ్రీనివాసరావు నీవు
అక్కడ శ్రీనివాసమే
నీ నివాసం చేసుకున్న చిదానందుడవు నీవు!

(అభ్యుదయవాది కొండేపూడి శ్రీనివాసరావు గుంటూరులో అస్తమించినపుడు)

* * *

# రైతు సేవాంతరంగా

నవంబరు ఏడు, పందొమ్మిది వందలు
పాతబడ్డ చరిత్రలో
మూతబడ్డ తారీఖు కాదని
నడుస్తున్న చరిత్రలో
నాయకుడవై వెలుగుతున్న నీవు
పుట్టిన రోజని గుర్తించి
పులకించి పోతున్నాము
పూజ్య రంగాజీ!

గోగినేని రంగనాయకులుగా
గుంటూరు మండలంలో పుట్టి
తెలుగుతల్లికీ భరతమాతకూ
వెలుగు తోరణాలు కట్టి
ప్రగతియాత్ర సాగిస్తున్నావు
రంగాజీగా రాణిస్తున్నావు-

ఇరువయ్యవ శతాబ్దాన్ని
ప్రారంభించిన నీ జీవితం
ఇరువయ్యొకటవ శతాబ్దాన్ని కూడా
ఆవిష్కరిస్తున్నది-
కాలపురుషుని కాంతి దూతవేమో నీవు
కాలాతీత జీవనజ్యోతివేమో నీవు
అందుకే
నిటారుగా నీవు నడుస్తుంటే
నింగినీ నేలనూ కలుపుతున్నట్లుంటుంది
మట్టిని నమ్ముకున్న రైతుల గోడు

మాధవునికి తెలుపుతున్నట్లుంటుంది
రైతుగా పుట్టి
రైతే ఇతివృత్తంగా రచిస్తున్న నీ జీవితం
అసంపూర్ణ రైతు రామాయణం-

భారత స్వాతంత్ర్య సమరంలో
బాపూజీకి అండగా నిలిచావు
దురాచారాలను దోపిడీలను
ఎక్కడున్నా ఎదిరించి
భూస్వామ్యాన్ని ధనస్వామ్యాన్ని
ఎల్లప్పుడూ ధిక్కరించి
ప్రజాస్వామ్యాన్ని కొలిచావు-

నీ కళ్లముందే పుట్టింది
ఈనాడు జీవిస్తున్న మానవకోటి అంతా
నీకు నిత్య నూతన యౌవనాన్ని
ప్రసాదిస్తున్న ఔషధం
నిర్భయంగా నిర్ణరంగా
నీవు చేస్తున్న ప్రజాసేవే
ఓ నిర్మల భావాంతరంగా
రైతు సేవాంతరంగా!
సమతా సమాజ సముజ్వల భవిష్యత్
రచనాచార్య శ్రీరంగా
నీవు పుట్టిన రోజే రైతు పుట్టిన రోజు.

*(1990- సందర్భం - 92వ జయంతి)*

* * *

# ఏ రుద్రుడో ఈ ఆరుద్రుడు

షష్టిపూర్తి చేస్తున్నారా
జరా మరణాలు లేని ఋషికి
దేశ కాలాతీత మనీషికి
భద్రునికి, నిర్నిద్రునికి
ఆరుద్రునికి-

సృష్టి చేసే దృష్టికలవానికి
నిలకడలేని వయస్సును
నిశ్చల తపస్సులో నిలిపివేసినవానికి
షష్టిపూర్తి చేస్తున్నారా?
అంధకారబంధురమైన
ఆంధ్ర సాహిత్యచరిత్రను
అక్షరకాంతి చిత్రలహరిలో ఆవిష్కరించిన
అపూర్వ భావ గంగాధరునికి-

నిత్య సత్య జీవన శిఖరాలమీద
నిరంతర చిరంతన నాట్యం చేసే
క్షేమారామ సాంబశివునికి
హరునికి శివంకరునికి
అరవై ఏళ్లు వచ్చాయని
ఆర్భాటం చేయటం
అమాయకత్వం కాదా?
మామూలు మనిషితో
శాంతినేత కార్ల్ మార్క్సుతో
జర్జరుడైన జీవునితో

నిర్జరుడైన దేవునితో
"త్వమేవాహం"గా తదాత్మ్యం చెందిన
ప్రగతిశీలికి ప్రతిభాశాలికి
నిత్యపరిణామ సత్యశూలికి
వచ్చినవి ఆరు పదులు కాదు
అరవై వసంతాలు తెచ్చిన
అమృత సాహిత్యనిధులు-

కోటి కోటి తెలుగు కంఠకలకంఠాలు
కీర్తించేది
ఏ రుద్రుణ్ణో కాదు
అసలైన ఆరుద్రుణ్ణే
అసమాన శక్తిసంయుక్తుడైన
ఈ ఆరుద్రుణ్ణే

*(ఆరుద్ర షష్టిపూర్తి సందర్భంలో)*

* * *

# హాస్యామరసవృక్షం

ఆయన ఒక జ్ఞాపకం అయిపోయాడు
అర్ధరాత్రి అలముకున్న అంధకారపు గుండెలో
అక్షర నక్షత్రమై పోయాడు
హైదరాబాదు కార్చిన కన్నీటి కెరటాలమీద
తన శాశ్వత విలాసాన్ని వ్రాసిపోయాడు.
పంజగుట్ట శ్మశానవాటికలో
తన ఆస్తిపాస్తులన్నిటినీ మంటలుగా మార్చుకొని
వెంటతీసుక వెళ్ళిపోయాడు.

కాలం అతని కాళ్లు విరిచివేసినా
జీవితానికి నడక నేర్పించాడు
వికలాంగులే సకళాంగులని నిరూపించాడు
నవ్వుల పాలౌతున్న లోకానికి
నవ్వుకోటం నేర్పించాడు
"అనుక్షణం ఆనందంగా బ్రతకడం
నా జీవితాశయం" అంటూ
అర్థంకాని జీవితానికి అర్థం చెప్పాడు
అన్ని వాదాలను రంగరించి
ఆశావాదాన్ని చిత్రించాడు
నవ రసాల వనంలో
"హాస్యామరస" వృక్షమై విరిశాడు.

తన కలం కన్న కలలు
కవిత్వం అయినా కాకపోయినా
నిజం అవుతాయని నమ్మిన

నిజాయితీపరు డాయన
భోగానికే కాని త్యాగానికి ఓటమిలేదన్న
విజయోత్సవ వీరు డతడు
భయం భయంగా దాగిన భవిష్యత్తును
అభయమిచ్చి ఆహ్వానించే వర్తమానకారు డతడు
చతురోక్తుల చక్రవర్తియై
ఆబాలగోపాలాన్ని అలరించిన
"గోలాయణ" కర్త అతడు
అందరినీ భక్షించే
'మృత్యువుకు మరణశిక్ష విధిస్తా'నన్న
మృత్యుంజయధాము డతడు
గోపాలశాస్త్రి నాము డతడు

* * *

# ఆత్మజ్ఞాన గోవిందుడు

కళ్లు మూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు
వివేకానందుడు-

ఒక శతాబ్దం క్రితం షికాగో మహానగరంలో
భిన్న భిన్న మతాల, అభిమతాల జీవితపథాల
విశ్వసమ్మేళన ధర్మవిచికిత్సాక్షేత్రంలో
అద్వైత గీతా రథసారథిగా
ఆత్మజ్ఞాన సమతా ధర్మవారధిగా
ఆవిష్కృతుడైన వివేకానందుడు
కళ్లు మూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు-

సత్యానికి భాష నేర్పించి మానవత్వానికి రూపు కల్పించి
అజ్ఞాన తమస్సు కళ్లు తెరిపించిన
విజ్ఞాన ప్రజ్ఞాన గోవిందుడు వివేకానందుడు
కళ్లుమూసుకున్నా కనిపిస్తున్నాడు
రామకృష్ణ పరమహంస ప్రేమ మానస సరోవరంలో
దివ్యానుభూతి జ్యోతిని దర్శించిన
అక్షరచక్షువు వివేకానందుడు
జనన మరణ తీరాలమధ్య తరగలెత్తే జీవితాలకు
అనంతత్వ తత్వానందాన్ని
అనుభవైక సత్యానందాన్ని
అందిస్తున్న రససింధుడు వివేకానందుడు
కళ్లుమూసుకున్నా కనిపిస్తున్నాడు -

మనిషి మనస్సును ఆవరించిన
స్వార్థ సంకుచిత విషవలయాన్ని
త్యాగబుద్ధి త్రికరణశుద్ధియోగంతో
ఛేదించడం బోధించిన సిద్ధేంద్రుడు వివేకానందుడు
కళ్లుమూసుకున్నా కనిపిస్తున్నాడు

తాను ధరించిన కషాయాంబరాలనుండి
నీలి నీలాంబర నిగూఢ రహోవిహంగాలను
ఎగరవేసిన కాలవేది వివేకానందుడు
నరలోకాన్ని సురలోకం చేసే
మనిషిని మాధవుడుగా తీర్చే
యుక్తినీ ఆధ్యాత్మిక శక్తినీ
సకల బాధావిముక్తినీ ప్రసాదించిన
ఆత్మజ్ఞానేంద్రుడు వివేకానందుడు
కళ్లుమూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు-

నిరుపేదలకోసం పరితపించేవాడే మహాత్ముడు
నిర్మల నిర్భాగ్యులను విస్మరించేవాడే దురాత్ముడు
అంటూ ఘోషించిన
మానవ సేవారాధకుడు వివేకానందుడు
అందరూ భయరహితులు కావాలని
మానవులందరూ త్వమేవాహంగా తాదాత్మ్యం చెందాలని
ఆబాలగోపాలాన్ని అలరించే అమృతవాక్కు వివేకానందుడు
"ఆనందో బ్రహ్మ" ఋక్కు వివేకానందుడు.

* * *

# మృత్యుంజయులు

ఓ కర్కశ కరాళ మృత్యువా!
నీ ప్రాణాపహరణ పథకానికి నియమ నిబంధనలు లేవా?
దయాదాక్షిణ్యాలు ఉచితానుచితాలు లేవా?
ఒక వేళనీ, ఒక చోటనీ ఒక సందర్భం అనే నియమం లేకుండా
చేతికి చిక్కిన జీవుల్ని చిత్రచిత్రంగా తినేస్తున్నావు
పుట్టిన ప్రాణులన్నిటినీ నీ పొట్టలో పెట్టుకుంటున్నావు
మరి మా సానోబర్ - నౌషీరు యువదంపతులు
ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలిద్దరితో
అందరూ వెళ్లే పూనా హైవేమీద అలవోకగా ప్రయాణిస్తుంటే
నలుగురినీ ఒక్క క్షణంలో నలిపేసి మింగేశావు-
నీ మెడలో వేసుకోవడానికి నీ జడలో ముడుచుకోవడానికి
ఏ పాపమెరుగని ఆ పసిపాపలే కావలసి వచ్చిందా?
ఒకరికోసం ఒకరు పుట్టిన ఆ యువదంపతులే దొరికారా?
కవితలో స్నానమాడి
కవితే దుస్తులుగా ధరించి ఆహారంగా సేవించి
కవితలో సంభాషించి పరవశించిన
కుల మతాతీత మానవతాప్రతీకలు వారు
వారు పుట్టి పెరిగిన భాగ్యనగరం
వారు ప్రేమించిన హైదరాబాదు కవితాసమితి
వారి సుగుణసుమాలతో గుబాళించాయి
ఎందరి నోటనో కవితలు పలికించిన
ఆ సుందర సాహిత్యశోభాదంపతులు
ఓ మృత్యువా! నీమాయాజాలంలో చిటికిపోయి
కవుల గుండెల్లో కన్నీటి కవితలైనారు
వాడిపోని స్మృతుల వసంతాలైపోయారు.

(1993)

***

# రామానుజరావు

తెలుగుతల్లి దరహాసాన్ని
తెలుగుభాష తీయందనాన్ని
తెలుగు సాహిత్య సౌరభాలను
తెలుగుబిడ్డ ఆవేశాన్ని
రంగరించి రచించిన వర్ణచిత్రం
రామానుజరావు-

రామానుజరావంటే
దేవులపల్లి రామానుజరావే
ఉపమానాలకు చిక్కని
అనుపమాన వ్యక్తి ఆయన
చెలిమికితప్ప బలిమికి శక్యంకాని
శక్తి ఆయన
తెలుగు చొక్కా తెలుగు పంచె ధరించి
తెలుగు రిక్షాలో పయనించే
ఆయన నిత్యనూతన జీవితం
ఆంధ్ర సారస్వత పరిషద్వాణికే అంకితం
ఛలోక్తులు రువ్వుతూ
గుండెనిండా నవ్వుతూ
వేషభాషా వివాదాలు మాపే
వేదాంతి ఆయన
సంస్కృతిని సంతృప్తితో కొలిచే
తాత్త్వికు డాయన
యౌవనం తప్ప
వృద్ధాప్యాన్ని సహించని దేహం ఆయనది

వాడా వీధీ వీడూ వంటి
విలాసం లేని గేహం ఆయనది
పద్యం వ్రాసినా ఉపన్యాసం చేసినా
వ్యాసం వ్రాసినా, పరిశోధన చేసినా
మొక్కవోని వాక్కు అతనిది-

షష్టిపూర్తులకు
సహస్ర పూర్ణిమలకు
స్వర్ణోత్సవ, వజ్రోత్సవాలకు
అతీతమైన
మృత్యుంజయ డమరుకహాసం అతనిది
నిత్య సత్య నిరాడంబర వేషం అతనిది
శిథిలం కాని శిశిరం లేని జీవితం అతనిది
బాపురే! ఆత్మీయతకు మారురూపం ఆయన
ఆంధ్ర సాహిత్య చరిత్ర సౌధంలో
అక్షర దీపం ఆయన

*(డా. దేవులపల్లి రామానుజరావుగారి స్మృతిగీతి)*

* * *

# పరస్పరం

నలుబదేళ్ల మన స్నేహం
నందనంలా విరబూచింది
తెలుగు సాహిత్య సౌరభాలు లోకమంతటా వెదజల్లింది
నాడు నిజాం కళాశాల ప్రాంగణంలో
నాటిన మన చెలిమి కలిమితోట
నేడు శైశిరభయం లేని వసంతాల కోట-

మనం స్నేహాన్ని నిర్వచించలేదు
జీవించాం - నిరూపించాం
మనం నిశ్శబ్దాన్ని నిందించలేదు - శబ్దాన్ని ప్రేమించాం
మనం అజ్ఞానాన్ని ఈసడించలేదు - విజ్ఞానాన్ని ఆదరించాం-

మనం నాస్తికులను కూడా గౌరవించే ఆస్తికులం
వివాదాలను విశ్లేషించే వివేకులం
సత్యాన్ని శోధిస్తున్నాం మానవత్వాన్ని బోధిస్తున్నాం

నేను చూచిన "రంగురంగుల చీకట్లు" రహస్యాలు నీకెరించాను
నీవు వ్రాసిన "జీవియస్ వ్యాసాలు"
నాకు బహూకరించావు
మనం ఒకరికి ఒకరం దేవు డిచ్చినవరం
మనం అంకితమై పోయాం పరస్పరం
అష్టైశ్వర్యాలు అనుభవించకపోయినా
త్రికరణ శుద్ధి సంపదతో తృప్తిగా జీవిద్దాం.

*(ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు నాకు 1993లో "జీవియస్ వ్యాసాలు" గ్రంథం అంకితం చేసినప్పుడు కలిగిన స్పందన)*

* * *

# నరసింహాత్వం

కరీంనగర మండలంలో పుట్టిన
కారణజన్ముడవు నీవు
తెలుగు తల్లి ఒడిలో పెరిగిన
తేజశ్శిఖరం నీవు
ఓరుగల్లు నదుటిమీద వెలసిన
భారత జాతి అదృష్ట జాతకచక్రం నీవు
ఎర్రకోట పూరించిన
ప్రజావిజయ శంఖం నీవు
విజ్ఞాన ప్రజ్ఞాన సింధువులో
వేయిపడగలెత్తిన
సత్య సాహిత్య చేతనం నీవు
బమ్మెర పోతన స్వాతంత్ర్య దీక్షను
భావించే భాషాంబర కేతనం నీవు-
వేల్పుల కీర్తి మూర్తిగొన్న
పాములపర్తి వేంకట నరసింహారావు నీవు-

పెరంబుదూరులో అమానుషత్వం
ఫెళ్ళున ప్రేలినప్పుడు
రాగం పండే దేశం నిండా
రక్తం చిందినప్పుడు
జనజీవన రాజీవం
కటిక చీకటి వ్యూహానికి బలియైనప్పుడు
మేలుకొన్న ఆశాస్వప్నానివి నీవు
హిరణ్యాక్ష వరాలు పొందిన

హింసారాక్షసత్వాన్ని
కొనగోటితో చీల్చివేసిన
ఎనలేని నరసింహత్వానివి నీవు
ప్రమాదాలు దాడిచేసిన ప్రజాస్వామ్య ప్రహ్లాదుణ్ణి
పరిరక్షించిన ప్రజ్ఞాశక్తియుక్తి రూపం నీవు
సమతా మానవతా ధర్మహర్మ్య దీపం నీవు
సమ్యక్ సమైక్య భారత సారథివి నీవు
విభిన్న అభిమతాలమధ్య
సయోధ్యారామ సత్య మందిరం నీవు
భక్తిజ్ఞాన కర్మయోగివి నీవు
అమ్లాన ప్రగతి రచనోద్యోగివి నీవు
నిత్యయౌవన వసంతుడవు నీవు
అందుకే అంకితం నీకు
ఈ "వాడిపోని వసంతాలు"
ఏనాటికి వీడిపోని
ప్రేమభావలతాంతాలు

*(భారత ప్రధాని Dr. P.V. నరసింహారావు గారికి 1992లో "వాడిపోని వసంతాలు" కావ్యాంకితం చేసినప్పుడు)*

* * *

## ఇస్మాయిల్ విలాసం

శబ్దానికీ శబ్దానికీ నడుమ
వినిపించే నిశ్శబ్దం ఇస్మాయిల్
చెట్టుకూ చెట్టుకూ నడుమ
కనిపించే ఆకాశం ఇస్మాయిల్
మృత్యు వృక్షం మీద వ్రాలి
సత్య ఫలాలు చవిచూచే
పలుకు చిలుక ఇస్మాయిల్
రహస్యాల రాత్రి గాత్రంమీద
కురుస్తున్న
సుస్పష్టమైన చుక్కలవాన ఇస్మాయిల్
తత్వానికి కవిత్వం కవిత్వానికి తత్వం
నేర్పిస్తున్న మానవత్వం ఇస్మాయిల్
వేయి వసంతాలు వెదకి వెదకి
తెలుగు కవిత్వం తెచ్చుకున్న
వాడిపోని తావిచెట్టు ఇస్మాయిల్
బాపురే!
సహజధర్మ గిరులమీద
శ్యామల ప్రేమారామాలలో
సూర్య చంద్రుల కాంతి కౌముదులు
అభినందన కిరణాలు చల్లుతుంటే
షష్టిపూర్తి జరుపుకునే
సాహిత్య కీర్తి ఇస్మాయిల్

***

# విశ్వంభర వీణా పాణి

ఆచార్య నారాయణరెడ్డీ!
సాహిత్య తపస్సులో నీ మనస్సు
కూర్చున్న మట్టిగద్దె
జ్ఞానపీఠం అయింది
నెరసిపోతున్న నీ నీలాలకలు
శివసుందర సత్యాలు కురిపిస్తున్న
మేఘ కిరీటం అయింది-

కపటనాటక కీటకాల విలాసం కోసం
నవ్వని నీ తొలి కావ్యపు పువ్వు
కష్టజీవుల కన్నీటిని తుడిచే
కర్మయోగ నాగార్జున సాగరంలో
నవజీవన కాసారంలో
పద్మశ్రీయై నవ్వింది
రసానందమందిరంలో పరిమళించింది-

వెన్నెల వాడల్లో విహరించిన
నీ ప్రణయరాగ చకోరాలు
రామప్పగుడిలో రవళించిన
నీ ప్రణవభావ మంజీరాలు
స్వేచ్ఛా ఉదయపు హృదయ్మంలో ఘోషించిన
నీ ప్రగతి ఋతుచక్రాలు
తెలుగు గుండెల వెండితెరమీద
బంగారు తీగలై సాగుతున్నాయి
విశ్వంభర వీణాశ్రుతులై మ్రోగుతున్నాయి-

సంప్రదాయానికి ప్రయోగాన్ని
ప్రయోగానికి సంప్రదాయాన్ని
ప్రాణభిక్షగా పెట్టిన
పురోగతి వితరణ శీలివినీవు
కాలపు తీర్పు ఇచ్చే మార్పు వసంతాలలో
మాయని మానవత్వ కర్పూర కేళివి నీవు-

హిమాలయాల ఔన్నత్యాన్ని
హిందూమహాసముద్రపు గంభీరత్వాన్ని
స్పర్శించే నీ ప్రతిభా పాండిత్య పక్షాలు
అక్షరాల గవాక్షాలు
అందుకోలేని ఆకాశాలు లేవు
అందుకే
భారత భారతి నీమీద పెట్టుకున్న
ఆశలకు అంతులేదు!

*(ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి ప్రతిష్ఠాత్మక జ్ఞానపీఠ పురస్కారం లభించినప్పుడు కవితా స్పందన)*

* * *

# కారణజన్ముడు సంజీవయ్య

స్తంభించిన కులతత్వ స్తంభం చీల్చుక
జృంభించిన మానవత్వం - సంజీవయ్య!
సత్యాన్ని హత్య చేయాలనుకున్న
స్వార్థపర రాక్షసత్వాన్ని
తన కొనగోటితో చీల్చివేసిన
సింహబలుడు - త్యాగధనుడు - సంజీవయ్య!

దరిద్ర నారాయణునికోసం
తపించిన ప్రజాస్వామ్య ప్రహ్లాదునికి
అభయమిచ్చిన దామోదరుడు - సంజీవయ్య!
జర్జర దళిత జీవితాలకు జీవం పోసిన
గర్వాగళ పర్జన్యం - సంజీవయ్య!
మనిషికి అస్పృశ్యతను పులిమిన
మలినాత్ములకు
వేదభూమిలో వర్ణభేద బీజాలు నాటిన
దురాత్ములకు సమతాదర్శం బోధించిన
ప్రగతిశీల - ప్రజ్ఞాశాలి - సంజీవయ్య!

కర్నూలు మండలంలో పుట్టిన
కారణజన్ము డాయన
పెదపాడు గూటిలో పాటనేర్చిన ఆ పిట్టపిల్ల
తెలుగునాడు తోటలో
శాంతి విప్లవ వసంతాలు వెలిగించింది
నిశాంత కోకిలయై దిశాంత యశోగానమై!

సంజీవయ్యకు జననం తప్ప మరణం లేదు
జయంతులు తప్ప వర్ధంతులు లేవు
దరిద్రులను మేల్కొపిన నిర్నిద్రుడు
బలహీనుల పాలిటి బలభద్రుడు - రుద్రుడు ఆయన!
భరతమాత కంఠంలో తెలుగు తల్లి వేసిన
అమ్లాన మల్లికామాల
సంజీవోజ్జ్వల జ్వాల -

రాజనీతికి జ్ఞానజ్యోతికి
మారుపేరైన రాజాజీయే
రచించిన జాతకచక్రం ఆయనది
దేశచరిత్రకే స్వర్ణాక్షరాలు సమకూర్చిన
జీవితచరిత్ర ఆయనది -

గొంతెత్తి హృద్యంగా
ఆయన తెలుగు పద్యాలు పాడుతేంటే
కృష్ణ వేణి తల ఊపుతూ తిలకించేది
గోదావరి గుండె పులకించించేది
ఆయన కళ్లల్లో రాయలసీమ కలలు కనేది
అతని చేతుల్లో తెలంగాణ పరవశించేది
ఆయన నవ్వుల్లో తెలుగుతీరం పరిమళించేది
ఢిల్లీకి పల్లెల నివేదన
పల్లెలకు ఢిల్లీ వేదన
వినిపించేది ఆయన దేశభక్తి
ఆయన త్రికరణశుద్ధికి అంజలి ఘటించేది
భారతదేశ ప్రజాశక్తి -

* * *

# జగన్నాథుని జైత్రయాత్ర

అరవై వసంతాలు
తన జీవిత రసాలవృక్షం మీద
ఆరిపోని వెలుగు గూళ్ళుకట్టుకుంటుంటే
నవానుభూతి గీతులాలపించే
యువకోకిల 'పేర్వారం-

'సాగర సంగీతం'తో తన గొంతు సవరించుకొని
'చేతనావర్తం'లో భావార్ణవాలెన్నో పొంగించిన
అభ్యుదయ తారాప్రియుడు
ఆచార్య జగన్నాథం-

నా 'ఎకనామిక్స్ సుందరి' రసజ్ఞోపజ్ఞను
ప్రస్తుతించిన ప్రతిభాపక్షపాతిగా
చీకట్లను వెలిగించే స్నేహజ్యోతిగా దర్శించాను అతణ్ణి-

కవితా కైలాసపురంలో పుట్టి
సవితా శిల్పైక శిలానగరంలో మెట్టి
తెలుగు విశ్వవిద్యాలయంలో వెలుగు గంటలు మ్రోగిస్తున్న
అక్షరార్చనాచార్యు డాయన

బోధకుడై - పరిశోధకుడై
పురోగమన సాధకుడైన
విజ్ఞాన కులపతి ప్రజ్ఞాన గుణమతి ఆయన-

పురాణాలన్నింటినీ పుక్కిలించి
నిత్య సత్య శివంకర సుందరానంద సుఖంకర
'వృషభపురా'ణాన్ని ఆవిష్కరించిన

సాహిత్య ఋషివరుడు సాహిత్య కృషి పండితుడు
పేర్వారం జగన్నాథం
జానపదం - జ్ఞానపదం కలిసి పాడే పాట
ప్రచీనం - అర్వాచీనం కలిసి సాగే బాట
మానవత్వం - దైవత్వం కలిసి కట్టుకొన్న కోట
వెరసి ఆచార్య పేర్వారం జగన్నాథం-

షష్టిపూర్తి ఎందరికో వస్తుంది
దృష్టిపూర్తి కొందరికే వస్తుంది
దృష్టిపూర్తి ప్రాప్తించిన సాహిత్య సృష్టికర్త
జగన్నాథుని షష్టిపూర్తికి దక్కింది
వచ్చిపోయే పదవులెన్నో ఆయన్ని వరించినా
వీడిపోని వినమ్రతనే ఆయన వరించాడు
వాడిపోని చిరునవ్వే ధరించాడు
ఆయన నాకు మిత్రుడు కాకపోయినా
ఆయన శేముషిని అభినందించేవాణ్ణే
మరి నాకు చిరకాల మిత్రుడై నందుకు
ఆత్మీయంగా ఆయన్ని అభినందిస్తూ
నన్ను నేను అభినందించుకుంటున్నాను
శీతాచల శిఖరంగా ఎదిగిపోతున్న ఆయన శిరస్సు మీద
ఆశీః కుసుమ వసంతాలు అగణితంగా కురిపిస్తుండాలని
కాలబ్రహ్మను కేలుమోడ్చి వేడుకుంటున్నాను.

*(ఆచార్య పేర్వారం జగన్నాథంగారి షష్టిపూర్తి సందర్భంలో "పేర్వారం సాహితీ నీరాజనం" సంచికలో చేరిన కవిత)*

* * *

# దృష్టి దాత

కళ్లిస్తున్నావా? డాక్టర్
కళ్లిస్తున్నావా!
చూపు - ఇస్తున్నావా! బ్రతుకు
చూపిస్తున్నావా?
కరుడు కట్టిన కాళరాత్రిని
కాంతి శస్త్రంతో చీలుస్తున్నావా!
ఆరిపోయిన దీపాలను మళ్లీ
అద్భుతంగా వెలిగిస్తున్నావా
శివుడవై, మాధవుడవై సాక్షాత్ బ్రహ్మవై
శిలలో జీవంపోస్తున్నావా
సృష్టికే దృష్టిని ప్రసాదిస్తున్నావా!
పూర్వ జన్మలో ఎంతటి పుణ్యం చేసుకున్నావో
ఇందరి కనుదమ్ములలో ఈనాడు
ఇనుడవై వెలుగుతున్నావు
కవి హృదయంలో రవి హృదయంలో
కవితోషస్సులు పండిస్తున్నావా!

కళ్లున్న వాళ్లకు కళ్లు లేనివాళ్ల కష్టాలు కనుపించవు,
కలిమిగలవాళ్లను నిరుపేదల
కన్నీళ్లు కరిగించవు,
కలిమిలేని కళ్లులేని వాళ్ల
కలలకు నీవు రూపం కల్పిస్తున్నావా!

కళ్లు మూసుకొని చూస్తున్నాను
కళ్లు లేనివాళ్లను

కళ్లు తెరచి వాళ్లకోసం కారుస్తున్నాను కన్నీళ్లను
దృష్టి లోపించినపుడు లోకం కీకారణ్యం
రంగు లేదు రూపం లేదు
రాత్రి లేదు పగలు లేదు
నరలోకం లేదు సురలోకం లేదు
నరక లోకమే అంతటా అప్పుడు.

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం"
అన్నారు అందుకే
సర్వ దానాలలో ప్రధానం
నీవు చేస్తున్న లోచన ప్రదానం
లోకన ప్రదానం అంటున్నాను

నీ అమృత హస్త స్పర్శతో
పునర్జన్మానుభూతిని పొందే
అసంఖ్యాక సోదరుల పక్షాన
నిన్ను కళ్లకద్దుకుంటున్నాను.

*(1980లో Dr.P. శివారెడ్డి గారు నిర్వహించిన నేత్ర చికిత్స శిబిరాలను దర్శించిన స్ఫూర్తితో)*

* * *

# కొలకలూరి షష్టిపూర్తి

కొలువు దీర వస్తున్నాడు
కొలకలూరి ఇనాక్
ప్రజావాణి పలుకుతూంది
బహుపరాక్! బహుపరాక్!

ఎవరయ్యా! ఈ ఇనాక్
ఎందుకు ఈ బహుపరాక్?
కాలవృక్షపు కొమ్మల్లో దాగిన
కలకంఠం అడుగుతూంది-

చీకటి కొలనులో విరిసిన వేకువశతపత్రం
వామలూరులో వెలసిన వాచస్పతి గాత్రం
కొలకలూరి చిద్రూపం
కోటి గుండెలను కదిపే కవితార్ణవ సంగీతం-

అరవై వసంతాలను తనరక్తంలో రంగరించుకొని
అనాథల జీవితాల మీద
అభ్యుదయ భావాలు కురిపిస్తూ
ఆవేశంతో దూకివస్తున్న ఆలోచనా తరంగం ఆయన-

మెట్టుమెట్టుగా ఏడు కొండలు ఎక్కి
నిర్భాగ్య, నిరీహ, నిర్బల జనావళికి
మేలు కొలువు పాడుతున్న సుప్రభాత గీతం ఆయన
మార్పు శంఖారావం ఆయన-

అస్పృశ్యతను అన్యాయంగా సాటి మనిషికి అంటించిన
కర్కశ కరాళ సమాజానికి

సరిక్రొత్త భాషలో యథార్థ పరిభాషలో
మానవత్వాన్ని బోధించిన
మహోపాధ్యాయు డతడు
సదాచారాచార్యు డతడు-

ఒక నవశతాబ్దాన్ని
సుందర స్వప్నాలమాలతో
తీరని వేదనల తోరణాలతో స్వాగతించే
సహేతుక సంస్కరణ వాది
సమతా తత్వ వేది అతడు-

తెలుగు 'వ్యాస స్ఫూర్తితో చేస్తున్న
ఆధునికాంధ్ర సాహిత్య సమీక్షణ' శక్తి అతడు
కావేరీదేవేరిహర్షించిన
"ముని వాహన" భక్తి అతడు-

"కులం-ధనం" కట్టిన అడ్డుగోడల్ని కూల్చి
"అభ్యుదయం" వెల్లివిరిసేటట్లు
"ఆశాజ్యోతి"ని వెలిగించిన కవితాగమశిల్పి అతడు
కథా చిత్రకారు డతడు-

'సమత', 'సౌందర్య వతు'ల
'భవాని', 'సౌభాగ్యవతు'ల జీవితగాథల్ని
సామాజిక సందీపన సందేశాలుగా అందించిన
సాహితీ సింధువు, సామాన్యుని ఆత్మబంధువు ఆయన-

ఆక్సిజన్‌లా చైతన్య శక్తిని అభాగ్యుల ఊపిరుల్లో నింపి
దగాపడ్డ దళితుల బ్రతుకుల్లో ధైర్యసాహసాలు రగిల్చి
అణగారిన కష్టజీవులకు హక్కుల రెక్కలు తొడిగి

ఆశావాదంతో ఘోషిస్తున్న
ఆత్మ గౌరవవేదం ఆయన-

విజ్ఞాన ప్రజ్ఞాన ఉపజ్ఞా కోకిలయై
విశ్వ వీథులలో విహరించి
నిత్య సాహిత్య సత్యాలను పరిశోధించి
ప్రతిష్ఠాత్మక పురస్కారాలు సాధించి
శ్రీవేకంటేశ్వరుని అభయ హస్తం క్రింద
ప్రగతి విశ్వవిద్యాలయాన్ని కొలుస్తున్న
ధన్య చరితు డాయన
అందుకే, కొలకలూరికి జరుగుతున్న షష్టిపూర్తి
యువతరానికి, నవ చైతన్య స్ఫూర్తి!

*(షష్టిపూర్తి సందర్భంలో ఆత్మీయసన్మందన - జూలై 1999)*

* * *

# అరవిందుల అడుగుజాడలు

శ్రీ అరవిందుల "దివ్య జీవితం"
మృత్యువుతో సాగించిన సంభాషణలో
మనః పరిమితులను అధిగమించే
మహత్తర మానవ హక్కును నిరూపించింది

అతని సావిత్రిక స్ఫూర్తి
నా విముక్త మేధాశక్తిని
అనాలోచిత సాహస కృత్యానికి పురిగొల్పింది,
ఊపిరాడని నా ఇంద్రియాలను
నా కతీతమైన అనంత అవిశ్రాంత
అంతరిక్ష చేతనలోముంచెత్తింది-

పరిభ్రమిస్తూ, ఊర్ధ్వ ముఖంగా వికసిస్తూ
ఆలోచిస్తూ, దర్శిస్తూ, అంతర్ముఖంగా అన్వేషిస్తూ
రూపాంతరం చెందుతూ, అడ్డంకులు అధిగమించే
మనిషి పట్ల ఆయనకున్న ప్రేమను
ఆరాధిస్తాను

భౌతికభారాలను అలసతను లెక్కచేయకుండా
భావ సీమల్లోకి చొచ్చుకుపోయే
ఆయన చేయి పూనిన
కలాన్ని కళ్లకద్దుకుంటాను
శోభించే అతని కలం నుంచి వెలువడ్డ
సత్యవాక్కులు ప్రసరించే
అంతర్ జ్ఞాన కాంతిరేఖ వెంట సాగుతూ
తళతళలాడే నక్షత్రాల నిగూఢ బ్రహ్మలిపికి

తాత్పర్యం తెలిసికొంటూ
నిబిడాంభకార బంధుర
యదార్థావరణం వైపు పయనించాను
అతి విశిష్ట వ్యక్తిని స్వాగతించడం కోసం
గౌరవారుణ కంబళి పరుస్తుంటే
కలల అలలపై పయనించే అతనికళ్లముందు
భవిష్యత్తు ముడతలు విప్పుకుంది

అతని కరుణామయ ముఖం మీద దివ్య హాసం వెలిగింది
మానవుని జన్మభూమిని
దృష్టిమాంద్య దూళిలో కప్పివేసిన
విధివిలాసాన్ని వివేచించింది
ఎగసిపోయే ఆయన శిరస్సుమీద
అనంత అ ప్రమేయ విశ్వాంతరాళాలకు
తెరచుకున్న పరమ సూక్ష్మరంధ్రాలలోకి
తొంగి చూశాయి.
రాకెట్టులా దూసుకుపోయే నా చూపులతో
ఆకాశాన్ని అవలోకిస్తుంటే
శ్రీ అరవిందుని అంతర్ జ్ఞానాలోచనల
అడుగుజాడలు అగుపించాయి నాకు
తీరంలేని నిశ్శబ్ద సైకతాలలో-

అవి, మనిషికి అనంతంత్యంతో ఉన్న అనన్యత్వాన్ని
దైవత్వంలో ఉన్న ఏకత్వాన్ని గుర్తు చేశాయి

*(శ్రీ అరవిందుల దివ్య స్మృతిలో స్వీయాంగ్ల మూలానికి అనువాదం)*

* * *

# చాటువులు

## సినారె

శ్రీరాజిల్లు సినారె ఆంధ్రకవితా శ్రీశైలశృంగ స్రవ
ద్ధారాపాత రసార్ణవోన్ముఖ వియద్గంగా వచో ధారుడై
పూరించెన్ శివసత్యసుందర జగద్భోధాత్మశంఖమ్ము స్వాం
తారామమ్ముల నిండ బ్రహ్మకళ పొంగారన్ ప్రజాకోటికిన్!

## మహాపాత్ర

విజ్ఞాన భువనేశ్వతుడు
ప్రజ్ఞాన పీఠాపురీశ్వరుడు
దీవించిన సాహితీ యాత్ర
సీతాకాంత మహాపాత్ర
అందుకే-
ఆయన తపః ఫలం భారతీయ జ్ఞాన పీఠం
ఆయన శిరో భూషణం అనంత భావదీప్తికిరీటం

## గ్రిగ్లాని

భగవద్భక్తి కళానురక్తి చిర సౌభ్రాత్వ్యత్వ మైత్రీ సుధా
పగయౌ అభ్యుదయోన్ముఖాంగ్ల కవితావైతాళికుండైన మా
గ్రిగులుండే మని చెప్పె? ప్రేమ రస వార్థిన్ తేలి రమ్మంచు జ్ఞా
న గవా క్షమ్మును విప్పి చెప్పె, గుణ వీణా పాణియై వాణియై

## మీరాఖాన్

నీవులేని నదరు లాండు తావిలేని పూలచెండు
నీవు రాని భరతావని కోకిలలేని ఆమని
మీరాభాన్! మేరీ జాన్ కనరావా! హేభగవాన్
అనిమిషు లట్లే మనుషుల ఆయుష్మంతులను చేయు
పరిశోధన కార్యార్థం సురలోకం చేరావా
ఏ నాటికైనా మనం ఎక్కడైన కలిసేమా!

# శేముషీంద్రునికి నక్షత్రఛత్రం

తొలుత నీ భాష ఋతుఘోష
నేడు నీ ఆత్మకలఘోష
ఋతంభర సాహిత్య పరిభాష
ఆవేదనా వేద నాదోద్భూత మానవ జీవిత జిగీష

నాడు నీవు శేషజ్యోత్స్నవు
నేడు విప్లవాత్మక రాగ ప్రత్యూషవు
అప్పుడు నీ వాక అల్లరి గోపాలుడవు
ఇప్పుడు భారత భారతి తన గుండెకు
హత్తుకుంటున్న తెలుగు వెలుగు బాలుడవు
శతాబ్దాలను శాసించే శబ్ద పాలుడవు

మూగశిలలకు, కలలుగనే కళాశిల్పం
నేర్పుతున్న ఉలి నీ కలం
మోడు బారిన చెట్లమీద ముసిరిన
గూడులేని పక్షుల కలకలం నీ గళం
శిశిరం దాడికి అదరి పోతున్న అడవులకు
పుష్ప బాణాలు కాదని
నీ జేబులో వేసుకొచ్చిన బాంబుల్ని అందించడం నీ వ్యూహం.
నీ ఊహతాకితే
కుప్పిగంతుల మాటలు కూడా
అపార శక్తి పారవశ్యంలో తేలిపోతాయి,
సొమ్మసిల్లిన సమాజ సౌమిత్రికోసం
చైతన్య సంజీవినీ పర్వతాలు మోసుకు తెచ్చే
సాహసోపేతలై పోతాయి

"ఆధునిక మహా భారతం"లో అద్భుత పాత్ర నీది
గుండెలదిరిన గాండీవాలకు భండన ధర్మం బోధిస్తావు
వంచిత ప్రజాస్వామ్య పక్షాన పాంచజన్యం పూరిస్తావు
నీ భావావేశ కురుక్షేత్రంలో శబ్దాలు సేనలై విజృంభిస్తాయి

ఛందస్సులు అస్త్రశస్త్రాలు ధరిస్తాయి
పద్యాలు పాపాల రక్తం తోడేస్తాయి
విజయ గర్వాలు పర్వాలై నిలుస్తాయి

నిఘంటువులకు తెలియని అర్థాలు
నీ దేశ ప్రజలకు బోధిస్తావు
కొంపలంటించే కుటిల నీతి చరిత్రకు కంపం పుట్టిస్తావు

దారితప్పిన కాలానికి
దిక్సూచికలు నీ కృతులు
అపరిశుద్ధ త్రికరణాల ఆటలు కట్టించే
జాగృతులు, నీ వైతాళిక రుతులు, సంహితలు
చమత్కారికలంటూ నీవు చెప్పేవైనా
త్రిభువనాల తలలు త్రిప్పేవే
రంగురంగుల చీకట్ల రట్టు గుట్టు బయట పెట్టేవే

ప్రతీక, భావచిత్ర విచిత్రాలంకారాల పల్లకీలో
పరవశించే నీ కవితా వధూటి
నరకాసురత్వం కంట పడగానే
సమరానికి ఉద్యమిస్తుంది
సత్యభామలా!

తాత్విక అంతరిక్షాన్ని తరచే నీరాడారు కంటి చూపు
రామాయణ రహస్యాలు గుర్తించింది

దేశదేశాల సంస్కృతుల జాడ లెరిగే నీజిజ్ఞాసకు
ఫ్రెంచి కవితా పాత్రలో బోద్లేర్ నించిన
సుషమాసవం రుచించింది
నీ చిదాత్మ సానుభూతితో స్పందించింది

నీ నివాసం సత్య శోధనరాజ గిరిపై
నీ దృష్టి ప్రగతి భావేందిరపై
నీ సృష్టి దీన 'జనవంశ' భాగ్యోదయం కోసం
నీ జీవితం నిర్నిద్ర యాత్రలో కంటున్న
నిర్మిమీషా స్వప్నాలకే అంకితం

వ్యాస వాల్మీక భాస కాళిదాసహర్షుల అత్మ ప్రభాసలను
నీ ప్రబుద్ధ ప్రమాత నేత్రాలలో భద్రపరచి
విరచించిన మాన వేతిహాసం
ఒక నవయుగీన మహెూదయం కోసం
వేచియున్న సాహితీ సరస్వతి మోముపై
విరిసిన విజయ హాసం

"జ్ఞానోద్యానం" లో
నేడు నిన్ను అలరిస్తున్న ప్రతిభా పురస్కార పత్రం
అను నిత్యం ఎదుగుతున్న నీ
శేముషీ శిరః శ్శిఖరానికి ఆనందాంబరం పట్టిన
ఆశీరక్షర నక్షత్రఛత్రం

*(1999, జూలై 19 నాడు మహాకవి డా.గుంటూరు శేషేంద్ర శర్మకు, కేంద్ర సాహిత్య అకాడమీ ఫెలోషిప్ పురస్కారం" ప్రదానం చేసిన సందర్భంలో విరిసిన ఆనందోత్సాహం)*

* * *